# ఉక్కు మనిషి

## (రష్యన్ నియంత స్టాలిన్)



గ్రంథకర్త:

గోవాడ నిరీక్షణరావు

గోవాడ

ప్రకటనకర్తలు:

నమ్మాళ్వార్స్

౨౧, స్టాలిటన్ ముత్యామొదలి వీధి,

పోస్టుబాక్సు నెం ౨౫౧, మద్రాసు.

సర్వస్వామ్య సంకలితము. ౧౯౩౮. వెల ఆరు అణాలు, లేక ఒక షిల్లింగు.

# గ్రంథకర్త:

జననం బందరుదగ్గర బైరాగిపాలెం. వయస్సు ౨౧ సంవత్సరాలు. హరిజనుడు. పత్రికాలోకానికి చిరపరిచితుడు.

ఆరేళ్లప్రాయంలో తల్లిదండ్రులు రంగూన్ తీసుకొని వెళ్ళినప్పుడక్కడ 'ఆంధ్రజాతీయసేవాసంఘం' (దొమ్మేటివారి పాఠశాల)లో విద్యాభ్యాసం. మరల తలిదండ్రులు ఆంధ్రదేశం, ౧౯౨౮ సంవత్సరంలో వచ్చి బందరు 'గవర్నమెంటు నిమ్నజాతీయవసతి గృహం'లో చేర్చారు. చేర్చిన కొద్దికాలానికే తల్లిదండ్రులు మరణించారు.

అప్పటికి చిన్నవయస్సగుటచేత, శ్రీయుత తాడిమేటి కుటుంబశాస్త్రిగారికి హరిజనదత్తసోదరుడుగ పెరిగాడు. హైద్రాబాద్‌లో ఆదిమాంధ్రనాయకుడు 'సంఘమాన్య,' 'శివశ్రేష్ఠి' యం. వి. భాగ్యరెడ్డిగారిదగ్గర వుండి పత్రికాప్రచురణపట్ల అనుభవాలు సంపాదించాడు.

హరిజనులు, సిరిజనులు అనడంగాక, ఒకేజాతిగ యేర్పడడానికి మార్గం 'సోషలిజమే' యని చెప్పేవ్యక్తి—కులమంటే గిట్టదు. ఇంత లేతవయస్సులోనే ఎంతో లోకజ్ఞానాన్ని ఆర్జించాడు.

'మార్పులు' తప్పక వచ్చితీరాలనే ఉద్రేకపూరితహృదయుడు.

కొంతకాలంనుండి భీమవరం, దగ్గర కొమరాడగ్రామంలో స్థిరస్థావర మేర్పర్చుకున్నాడు. అయితే, ఉన్నతవిద్య లేని లోటుకు కాబోలు మరల గుంటూరులో విద్య నభ్యసిస్తున్నాడు.

హరిజనులలో అభివృద్ధికి రాగల నవయువకుడు.

—నమ్మాళ్వారు.

# ఉక్కు మనిషి

౧

## ప్రవేశిక

నాయకత్వమనేది చాలా చిక్కులతో కూడుకొన్న విష యము. నాయకుడైనవాడు ఏ ఉద్యమానికీ వెనకబడరాదు. అట్లా పడితే, జనసామాన్యానికి ఎడమైపోతాడు. మరి ముందుకూ దుమక రాదు. అట్లా దుమికితే, ప్రజాసామాన్యంతో సంబంధమే తెగిపో తుంది. కాబట్టి, ఏ ఉద్యమాన్నైనా నడిపింపదలచుకున్నవాడు వెనకకు గుంజేవాళ్ళను గుంజనీయకుండ, ముందుకు లాగేవాళ్ళను లాగనీయకుండ, ఉద్యమాన్ని సమానస్థాయిలో చక్కగ నడిపించు కుని పోవలసివుంటుంది.

—జోసెఫ్ స్టాలిన్.

* * *

స్టాలిన్ రష్యన్ నియంత. ప్రపంచములోని ఇతర నియంతలకు అతనికి తేడాలున్నాయి. ఒక దేశానికి అతడు ఎదురులేని నాయకుడేగాక, ప్రపంచములో అన్ని దేశా లలోకూడ వ్రేళ్లు పాతుకుపోతున్న ఒకానొక మహో ద్యమానికి అతడు నాయకుడు. ఆమహోద్యమముపేరు సామ్యవాదము.

హిట్లర్, ముసోలినీలు జర్మనీ, ఇటలీ దేశములకు

ప్రథమ నియంతలు. స్టాలిన్ రష్యానియంతలలో రెండవ వాడు.

రాజనీతిజ్ఞునికుండు దూరదృష్టిని, మతప్రబోధకుని కుండు గాఢవిశ్వాసమును, పరిపాలకుని కుండు విపులకార్య నిర్వహణదక్షతను, మాంత్రికునికుండు ప్రబలవశీకరణ శక్తిని, వీరవరుని కుండు ఆశేషధైర్యస్థైర్యములను కలిగిన పురుషపుంగవుడు - అయిన లెనిన్ రష్యా ప్రథమ నియంత.

సామ్యవాదమంటే ఏమిటి?

లెనిన్ మహాశయుడు కారల్ మార్క్సు శిష్యుడు, సామ్యవాది. బహుసంఖ్యాకులు రేయింబవలు ఎక్కలు విఱుచుకొనియు కూడుగుడ్డలకు గతిగానక అన్యాయము పాలగుచుండ, ఎవరో నలుగురు పరులందరి కష్టార్జితమును స్వీయభోగోపసిద్ధికి వెచ్చించుకొన వీలుకలుగజేయు సంఘ వ్యవస్థను రూపుమాపి, ఉచ్చ, నీచ—శ్రీమంత, నిరుపేద మొదలుగాగల కృత్రిమభేదముల కెడమీఁని, నూత్న మానవసంఘమును నిర్మించుటయే సామ్యవాదము. ఈ వాదముకొఱకే లెనిన్ జీవించెను; దీనికొఱకే అతడు పెక్కుక్లేశముల ననుభవించెను; తుదకు దీనిలోనే మరణించెను! *

స్టాలిన్ నియంతృత్వాధికారమును లెనిన్ నుండి సంగ్రహించినాడు. లెనిన్ అతనిని తనకు వారసుగ నియ

* Rene Fulop-Miller: Lenin and Gandhi.

మించలేదు. పైగా తన యనంతరమం దతడు నాయ కత్వము వహించరాదనికూడ లెనిన్ గట్టిగ నిషేధించి నాడు. ఇందు విషయమై లెనిన్ మహాశయుడు ఎంత గట్టిగా వ్రాశాడో చూడండి:—

"కామ్రేడ్ స్టాలిన్ చాలా మోటుమనిషి............ అతనిని ఎట్లాగైనాసరే పార్టీ శెక్రటరీ పదవినుండి తొలగించి, అతనికంటే, భిన్నప్రకృతిగల ఇంకొకమనిషి నెవరినైనా పెట్టు కుంటే బాగుంటుందని నామిత్రులకు మనవిచేస్తున్నాను.

అతనికంటే ఎక్కువ ఓర్పు, ఎక్కువ నమ్రత, ఎక్కువ భక్తి విశ్వాసములు, తక్కువ గయ్యాళితనంగల- మిగతా మెంబర్ల యందు ఎక్కువ ఆత్మ్యమువుంచేవాణ్ణి చూచి పెట్టుకోవలసిందని నాసలహా............"

* • *

ఇది 1924 సంవత్సరంనాటిస్థితి. పదకొండేం డ్లైనతరువాత కథ అడ్డంగాతిరిగింది. స్టాలిన్ని లెనిన్ అప్పుడెంత తీవ్రంగా తిట్టాడో, అతని ఉద్యోగు లిప్పుడు స్టాలిన్ను అంత ఘనంగా పొగడడం సాగించారు. స్టాలిన్ చాలా 'గొప్పవాడు', 'ప్రేమపాత్రుడు', 'ధైర్యశాలి', 'మహాబుద్ధిశాలి', అనే పొగడ్తలతో రష్యాసోవియట్ పత్రికలు నిండిపోతున్నాయి. స్టాలిన్ పేరుతో నాలుగు పట్నాలుకూడ వెలిసినవి. 'మనమిత్రుడు, మనబాంధ వుడు, మన నాయకుడు చిరంజీవియగుగాక!' యను స్తోత్రపాఠములుకూడ దిక్కులు మారుమ్రోగునట్లు రష్యాలో చెలరేగసాగినవి.

స్టాలిన్‌కు ఇంతశక్తి ఎట్లావచ్చిందో, దానికి మూల కారణాలేమిటో కొంచెం బేరీజువేసి చూద్దాము :

మొదటిసంగతి యేమిటంటే,—స్టాలిన్ మంచి శరీరదార్ఢ్యము గలవాడు. అతనికి అప్పుడప్పుడు కొంచెం గుండెజబ్బు కనపడుతుంది. అంతమాత్రమే ! ఇక అతనిది ఉక్కుశరీరము. ఎంత శ్రమనైనా సహిస్తుంది.

ఓర్పు, పట్టుదల, దీక్ష అతనికున్నవి. అతని పట్టు భల్లూకపుపట్టు- రాక్షసిపట్టు. కార్యనిర్వాహణంలో అతనిది మందగమనం. అందువల్ల అతని అనుచరులకు విసుగు పుడుతుంది. అతని మాంద్యము వాళ్ళకు అర్థముకాదు. ఎందువల్లనంటే అతనిమనస్సులో ఏప్లానువుందో అంతా ఒక్కసారి వాళ్ళకు అవగాహనగాక కొట్టుకుంటారు. అతని మనస్సులో ఏదో దీర్ఘమైన ఆలోచన వుంటుంది. ఆ ఆలోచన అందుకుని ఆతడు అటుయిటు తొలగకుండ పోతూవుంటాడు. ఆదోవ యింకొకళ్ళకు కనబడక, కొట్టుకుంటూ, విసుక్కుంటూ వుంటారు. తనమార్గమందు లక్ష్యముతప్పకుండావుండే తదేకదీక్ష అతనికి అనంతంగా వుంది.

స్టాలిన్ బుద్ధికౌశల్యము, తాంత్రికశక్తి నిరుపమానము.

స్టాలిన్‌కు యిటు అటు కూడ ప్రతికక్షులున్నారు. ఇటు ఎడంవైపున ట్రాట్‌స్కీ, జినోవీ, కమెనెవీ వగైరా వర్గమున్ను అటు కుడివైపున బుఖారిన్, రడెక్, టంస్కీ- వగైరా వర్గమున్ను విరోధులుగ వున్నారు. ఈ

ఉభయవిరోధవర్గములను స్టాలిన్ సవ్యసాచిగ చెండాడివేసినాడు. అతని భల్లూకపుపట్టుదల—విరోధులను సాధించవలెననే నిర్దాక్షిణ్యప్రకత్తు, సూక్ష్మగ్రాహి తాంత్రికపు ఎత్తులమారితనము...వీనికే తుదకు జయము కలిగినది.

తనకు వాటంవారీగ కనబడితే, అంత నిష్కపటియైన మనిషి లేడన్నట్లుగ స్టాలిన్ ప్రవర్తిస్తాడు. తనతప్పు ఒప్పుకోగల ధైర్యస్థైర్యములు స్టాలిన్‌కు వున్నవి. ఇట్టివి ఇతర నియంతలకు సాధారణంగా వుండవు. ఇందు కొక ఉదాహరణము చూడండి :—

ప్రయివేటుగ రైతులకున్న చిన్నచిన్న పొలము చెక్కల నన్నిటిని కలిపివేసి, ఉమ్మడిగ ఏకఖండముగ రాజ్యాంగంద్వారా వ్యవసాయంచేయిస్తే బాగుంటుందని స్టాలిన్ ఒకస్కీము వేశాడు. దానిని త్వరత్వరగ అమలు జరుపడానికి ప్రయత్నిస్తే రైతులు తిరుగుబాటుచేశారు. పండించిన పంటలను తగులబెట్టారు. చాలా పశునష్టమయింది. చిట్టచివరకు కరువువచ్చింది. అప్పటికి స్టాలిన్ కండ్లు తెరిచాడు. తనస్కీము నింతత్వరితంగా—ప్రజలు అర్థంచేసుకోకమునుపు—అమలు జరిపించడం తప్పని గ్రహించాడు. గ్రహించి, బహిరంగంగా ఒప్పుకుంటూ 'జయంవల్ల తలదిమ్మెక్కింది' అన్నాడు.

తప్పుఒప్పుకునే విషయంలో 'లెనినిజమ్' అనే పుస్తకంలో స్టాలిన్ యిలా వ్రాస్తున్నాడు వినండి :—

"ఒకడు తానుచేసిన తప్పును ధైర్యంగా ఒప్పుకోవాలి. ఒప్పుకొని, వీలైనంత త్వరలో దానిని దిద్దుకోవాలి. ఇదీ మనకు ముఖ్యంగా కావలసింది. దేనిలోనైనా జయంకలిగితే, సాధారణంగా మన తల తిరిగిపోతుంది. ఇట్టి విరుగబాటుస్థితిలో వెంటనే 'నేను తప్పుచేశాన'ని ఒప్పుకోడానికి మనస్సు ఒప్పదు—ఎంతో ధైర్యం ఉంటేనేగాని. మనలో మనమే విమర్శించుకోలేని పిరికితనం ఏర్పడుతుంది. చేసినతప్పును వెంటనే, నిష్కర్షగ, దిద్దుకోడానికి మనస్సు యిష్టపడదు—ప్రతిష్ఠ అడ్డంవస్తుంది. ఇవన్నీ చాలా అడ్డంకులుగ ఏర్పడుతయి."—

చిన్నచిన్న సంగతులుకూడా స్టాలిన్ మిక్కిలి శ్రద్ధతో చూస్తాడు. ప్రజాజీవితంలో ఎంత చిన్నసంగతైనాసరే, అతనికంట పడకుండ ఉండదు. స్టాలిన్ పత్రికలను ఆఖరుపేజీవరకుకూడ విడిచిపెట్టకుండ చదువుతాడు. ప్రొద్దున్నే లేవగానే అతని మొదటిపనే అది. సోవియట్ రాజ్యంలో ప్రచారమయ్యే పత్రికలన్నీ అతడు చదువుకుంటాడు.

అందువల్ల, తన మామూలుపనికి సంబంధించినవి కాకపోయినా, మారుమూలలనున్న ప్రజల కష్టాల నెన్నిటినో, ఎన్నెన్నో చిన్నవిషయాలలోకూడ, స్టాలిన్ స్వాయముగ జోక్యముకలిగించుకొని, మాన్పడానికి వీలైంది—అని ఒక ప్రతికక్షివిమర్శకుడు అన్నాడు.

౧౯౩౩-వ సంవత్సరం వేసంగిలో స్టాలిన్ సైబిరియా ప్రాంతములో క్రొత్తగా కట్టబడిన పారిశ్రామిక పట్నాన్ని చూడబోయినాడు. ఆప్రాంతములో 'గ్యారీ'

అని పేరుగల ఒకగొప్ప కవివున్నట్లుగ ఆతనికి జ్ఞాపకం వచ్చింది. 'ఆయన యేడీ!' అని అడిగాడు. 'ఆయన యిప్పుడు జైలులోవున్నాడ'ని జవాబు. స్టాలిన్ ఆతనిని తత్క్షణమే విడిపించివేసి, 'ఈపట్నంమీాద కవిత్వం కట్టవలసింద'ని ఆజ్ఞాపించినాడు.

౧౯౩౨-వ సంవత్సరంలో కమ్యూనిస్టు కాంగ్రెస్‌లో ఒక ఉపన్యాసకుడు కొన్ని పనికిమాలిన శాస్త్రపుస్తకాలనుగురించి మాట్లాడుతూవుండగా, 'ఇవ్వి గావు,అవ్వి!' అని స్టాలిన్ చటుక్కున దిద్దినాడు.

౧౯౩౪-వ సంవత్సరం డిశంబరులో లెనిన్‌గ్రాడ్ నగరములో తన మిత్రుడు కిరోవ్ నెవడో చంపినప్పుడు, స్టాలిన్ స్వయముగ అచ్చటికి వెళ్ళి, 'చంపినవాడవు నువ్వేనా?' అని ఆహంతకుణ్ణి ముఖాముఖిని అడిగినాడు!

అతని శక్తికి యింకో కారణ మేమిటంటే:—ఏ మనిషిని యెట్లా పట్టుకురావాలో స్టాలిన్‌కు బాగా తెలుసును. గాఢమైన రాజకీయపు యెత్తులు వేయగలడు. పార్టీని భయభక్తులలో వుంచుకోనగలడు. సాటిలేని నిర్మాత అతడు.

అతడు చాలామంది మనస్సులు నొప్పించి యున్నాడు. మానవత్వ మతనియందు లేదని వాదించే కమ్యూనిస్టులు చాలామంది వున్నారు. అయినప్పటికి అతని యనుచరులు అతనికొరకై భక్తివిశ్వాసములతో పనిచేయుదురు. తన అనుచరుల నేరుకోనుటలో ఆతడు మిక్కిలి

చాకచక్యము చూపును.

స్టాలిన్ వక్త కాడు; అతని ఉపన్యాసములు ఏదో బ్యాంకు పరిపాలనానివేదికలలాగ పొడిపొడిగ వుంటవి. అతని వ్రాతకూడ సులభగ్రాహ్యముగ వుండదు. ముఖ్యముగ ప్రతికక్షుల సిద్ధాంతాలకు తన సిద్ధాంతాలకు వుండే సూక్ష్మభేదాలు ఉపపాదించేటప్పుడు మరీ అధ్వాన్నంగా వుంటుంది. ఏదో పరీక్షపేపరు వ్రాస్తున్న విద్యార్థివ్రాతవలె వుంటుంది—'మార్క్స' సిద్ధాంతాలలో తాను మేలైనవాడని అనిపించుకోవాలని అతని ఆశ. సిద్ధాంతాలు వదలి మాట్లాడేటప్పుడు మాత్రం చక్కగ, అందరికి తెలిసేటట్లు ఉంటయి అతని ఉపన్యాసాలు. ఒకప్రశ్న వేసుకోవడం, దానికి జవాబుచెప్పడం——ఈపద్ధతి ఉపన్యాసమంటే అతనికి చాలాయిష్టం. అతని ఉపన్యాసం ప్రశ్నోత్తరమాలికవలె వుంటుంది. శైలి బహుజనులకు తెలిసేటట్టు వుంటుంది.

స్టాలిన్ యోచన మందగతిని నడచినను కూలంకషంగా వుంటుంది. బుద్ధి వెనక, ముందు జాగ్రత్తగ పార చూచుకొననిది నడవదు. చురుకుతనం, తీక్ష్ణం తక్కువ. అయినప్పటికీ గబగబమాట్లాడే హెచ్. జి. వెల్సు పండితునితో స్టాలిన్ తేలిపోకుండ గంటలకొద్ది మాట్లాడి నెగ్గగలిగాడు. అట్లాగే ౧౯౨౭-వ సంవత్సరములో అమెరికానుండి వచ్చిన కార్మికరాయబారవర్గంతో కూడ స్టాలిన్ వెనకతీయకుండ మాట్లాడగలిగాడు. నాలుగు గంటలు ఏకాఏకిని అనేకవిషయాలమీద తడుముకో

కుండా సంగతులన్నీ పూసగ్రుచ్చినట్లు వివరించి మాట్లా డాడు. మనస్సులో ఏవిషయమునుగురించిగాని ఏమాత్రం జంకువున్నవాడుగాని యిట్లా మాట్లాడలేడు. ఈ సంభా షణ ౧౧,౦౦౦ మాటలతో అచ్చయివున్నది. సోవియట్ సిద్ధాంతాలన్నీ దీనిలో ఆమూలాగ్రంగా ప్రతిపాదింపబడి వున్నవి. ఆసంభాషణ ఇప్పుడొక అపూర్వగ్రంథమైవుంది.

తాను మరి ప్రశ్నల వర్షానికి జవాబులుచెప్పడం అయిపోయినతరువాత. 'మిమ్ములను నేను కొన్ని ప్రశ్నలు అడగవచ్చునా?' అని స్టాలిన్ అడిగాడు—అమెరికా రాయబారులను. వారు సరేనన్న తర్వాత, రెండుగంటల సేపు వాళ్ళను ప్రశ్నలలో ముంచివేశాడు. తను ఒక్కడు చెప్పిన జవాబులకంటే వారంతా కలిసి చెప్పిన జవా బులు ఏమీ అంత మెరుగుగలేవు. ఈ ఆరుగంటల సంభా షణకాలంలో స్టాలిన్‌ను ఎవరు ఒక్కసారియైనా టెల్లి ఫోనులో పిలువలేదు. ఏ శెక్రటరీగాని వచ్చి ఆసమయం లో తనతో మాట్లాడడానికి వీలులేదని ఖాయిదా చేశాడు. అంటే, ఏపనిమీద కూర్చుంటే, ఆపనిమీదే తదేకధ్యానం వుండాలిగాని, రెండోసంగతి అతనికి పనికి రాదు.

స్టాలిన్‌లో యింకోవిశేషం. అతను నమ్మిన కమ్యూనిజమందు అతనికి అమితవిశ్వాసం. ఆవిశ్వాసమే అతనికి బలం. 'పాదరీ'కి ఏసుక్రీస్తంటే ఎంతభక్తో స్టాలి న్‌కు కమ్యూనిజంఅంటే అంతభక్తి.

నిర్దాక్షిణ్యం చూపడంలో స్టాలిన్ అతిగా పో

తాడు. అతడు ఎదిరివర్గంమీద వేసిన శిక్షలు లోకం దద్ద రిల్లేటట్లున్నవి. ఎదిరివర్గాన్ని నిర్దాక్షిణ్యంగా దుంపనాశ నం చేయడమే రష్యాకమ్యూనిస్టులు మొట్ట మొదటినుండి పెట్టుకున్నారు. తన సిద్ధాంతాలకు అంగీకరించకుండ ఎదు రుతిరిగిన రైతులను కరువు అనే ఖడ్గంతో నాశనంచేయ డానికి స్టాలిన్ జంకలేదు. ఎన్నిచెప్పినా, కొసకు, అన్ని గవర్నమెంట్లుకూడ, పశుబలంమీద ఆధారపడవలసిందే అని అనిపించింది.

అయితే, రష్యాలో ఈ పశుబలాన్ని ఎకాఎకీని ప్రయోగించారు. ఒక నూతన సాంఘిక పరివర్తనంకోసం ఉపయోగించారు. ఈపరివర్తనంవల్ల ౧౬కోట్ల రష్యనులకే గాక యావత్తు మానవజాతికికూడ శ్రేయంకలుగుతుందని వీరి నమ్మకం. ఇట్టి సత్ఫలితంకోసం ఏంపని చేసినాసరే తప్పులేదని ఈరష్యావారిమతం. ఈమాట స్టాలిన్ నిర్మొగమోటంగా చెప్పివేస్తాడు. దాపరికంలేదు. 'మనుష్యులనుఎంతకాలం ఇలా చంపుతూ పోతావయ్యా!' అని అడిగింది ఒకామె స్టాలిన్‌ను—'ఎంతకాలం అవసరమైతే అంతకాలం' అని అతడు జబాబుచెప్పాడు!

రష్యాదేశంవిడిచి బయట చాలాకాలంవున్న సోవియట్ నాయకుణ్ణి 'స్టాలిన్‌నుగురించి నీ అభిప్రాయం ఏమిట'ని అడిగితే, 'నాకళ్ళకు నెత్తురుత్రాగేవాడులా వున్నాడు!' అని జబాబుచెప్పాడు.

అజ్ఞాతజీవనము:

1905 ౧౯౦౫-వ సంవత్సరంలో విప్లవోద్యమము విఫల

మైపోయినప్పుడు తక్కిన విప్లవనాయకులంతా రష్యా విడిచి పరదేశాలకు పరారైనారు. స్టాలిన్ ఒక్కడే దేశం విడిచిపెట్టకుండ, దేశంలోనే దాగివుండగలిగినాడు. అంతధైర్యం తక్కినవారెవరికి లేకపోయినది. లెనిన్ అంతటివాడు కూడ ౧౯౧౭-వ సంవత్సరంవరకు ఎక్కడనో పరదేశాలలో కాఫీహోటళ్ళ చిప్పలు కడుగుతూ బ్రతికాడు, విప్లవనాయకులంతా చెల్లాచెదరై తలొక దేశంలో ఇక్లే తలదాచుకున్నారు. ఈపదిపన్నెండేండ్లు కూడ స్టాలిన్ రష్యాను విడిచిపెట్టకుండానేవున్నాడు. ఎక్కడనో ఊడిగంచేసుకుని రహస్యంగా బ్రతికేవాడు; వీధులూడ్చుకుని బ్రతికేవాడు. ఈస్థితిలో క్రిందితరగతి ప్రజలలో అతనికి బాగా పరిచయం కలిగింది. అచ్చట నున్న విప్లవకూటములతో సంబంధ మేర్పడింది. దానినే తదుపరి అతడు పైకితీసికొనివచ్చి, తనకు అవసరము కలిగినప్పుడు బాగా ఉపయోగించుకున్నాడు.

ట్రాట్స్కీ హయాంలో వున్నట్టుగ ఇప్పుడు కమ్యూనిస్టుపార్టీలో భేదాలులేవు. స్టాలిన్‌కు ప్రతికక్షు లెవరూలేరు. స్టాలిన్ ఎదురులేని సర్వాధికారి- నియంత. పార్టీనియమములు, శిక్షణ కఠోరముగ నుండును. స్టాలినే ఈశిక్షణక్రమమునంతను నడిపించును. పార్టీకి, రాజ్యాంగానికి భేదంలేదు- రెండూ ఒకటే. పార్టీయంత్ర ములో ప్రతిమర, ప్రతికీలు స్టాలిన్ చేతులోవున్నవి.

పార్టీయంత్రము:

స్టాలిన్‌వల్ల పార్టీ సెక్రటరీ పదవికి ప్రాముఖ్యం

వచ్చిందిగాని, పార్టీ శెక్రటరీపదవివల్ల స్టాలిన్‌కు ప్రాముఖ్యం రాలేదు ! స్టాలిన్‌కు ముందు అనేకమంది శెక్రటరీలుగా వున్నారు, వారిపేర్లు పైకివచ్చినయ్యా ? వాళ్ళల్లో ఒక డిప్పుడు బొగ్‌డనోవ్ అనామకుడు— ఇంకొకడు— క్రెస్‌టిన్‌స్కీ—ఏదో చిన్న ఉద్యోగి! అంతే. పార్టీయంత్రం తనచేతుల్లో వుంచుకోవడంవల్ల చాలా లాభాలున్నయ్యని గ్రహించినవాడు స్టాలిన్ ఒక్కడే. అందుకని, తాను వెనుక అజ్ఞాతంలోవున్న కాలంలో లభించిన తన మనుష్యులనందరిని క్రమక్రమంగా ప్రతి ఆఫీసులోను యిరికించాడు. దానితో క్రమంగా అతనికి బలం పెరిగింది.

'లెనిన్ తనబుద్ధిబలంచేత, తన ఘనతచేత రాజ్యం చేశాడు. స్టాలినో తన నిర్మాణప్రతిష్టతచేత రాజ్యంచేస్తున్నాడు'—అని చాలామంది అనుకుంటారు యిప్పటికే—

కాబట్టి, సహజంగా రాజ్యంలో స్టాలిన్ కంట పడని విషయమంటూ వుండదు. అతడు చారుచక్షుడైనాడు. ఒకనికి ఏదో రహస్యరోగం తగిలింది. ఒకసారి అతడు స్టాలిన్ కంటపడితే, 'సరే, అబ్బాయి నీ ...... ...రోగం ఎట్లావుంది?' అని అడిగాడు !

విరోధివర్గాన్ని ఎదిరించవలసి వచ్చినప్పుడు, 'నాదేముంది? ఇది లెనిన్‌చేసిన ఉపదేశమే.' అని త్రిప్పికొట్టుతూవుండేవాడు. 'నడిపించేదంతా లెనినే—నేను లెనిన్ చేతులలో నిమిత్తమాత్రుడ'నని స్టాలిన్ చెప్పుతూవుండేవాడు. తన ప్రతికక్షుడైన ట్రాట్‌స్కీతో జరిగిన దీర్ఘవివాదములన్నిటిలో స్టాలిన్ ఈ ఎత్తే వేసి దా

టుకు పోతూవుండేవాడు. 'నీలెనినిజమ్, దొంగలెనినిజం' అని ట్రాట్‌స్కీని ఎల్లప్పుడు స్టాలిన్ తిడుతూవుండేవాడు.

లె నిన్ శి ష్యు డు !

రష్యాదేశంలో ఇంతకంటే గొప్పతిట్టు— గొప్ప పాపంలేదు. ఈమాటలకు- పాపము—ట్రాట్‌స్కీ క్రుంగి పోతూవుండేవాడు. లెనిన్ వాక్యాలు స్టాలిన్ మాటిమాటికి-భగవద్గీతశ్లోకాలకు మల్లే- ఉద్ఘోషిస్తూ వుండేవాడు.

దీనినిపట్టి యింకొక విశేష మేర్పడుతూవుంది. బయటి ప్రపంచ మంతా తమకు శత్రువనే సిద్ధాంతంమీద సోవియట్‌యొక్క మూలబలం యేర్పడ్డది. కాబట్టి దాని బలంమీద అదే ఆధారపడవలసి వచ్చింది. అందువల్ల, సోవియట్ నిర్మాణం జిగిబిగిగ, స్వయంసంపూర్ణంగా, రెండవవాళ్ళ ప్రేక్ష్యం లేకుండ ఏర్పడ్డది. మార్క్స్, లెనిన్—చెప్పిన మాటలే ఆదేశానికి ప్రమాణాలు. దానిలో మార్పుకు అవకాశంలేదు. ఆప్రమాణప్రకారం తు, చ, తప్పకుండ సంఘాన్నినడిపించే స్టాలిన్ రష్యాలోనున్న ప్రజాసామాన్యానికే కాకుండ, తక్కిన విరోధప్రపంచాన్ని ముఖాముఖిని ఎదుర్కొనుచున్న తదితరరష్యనులకు కూడ ప్రవక్త అయినాడు.

నాయకుడు సిద్ధాంతంలో ఐక్యమై పోయినాడు. అందువల్ల, ఉభయులకు అవినాభావసంబంధమేర్పడింది. స్టాలిన్ లేనిది రష్యాలేదు— కమ్యూనిజంలేదు.

———

# విప్లవజీవితం

అసలు అతనిపేరు యోసిఫ్. ౧౮౭౯-వ సంవత్సరంలో జార్జియారాష్ట్రంలో, టిప్లిస్ పట్టణ సమీపమున 'గోరా' గ్రామంలో స్టాలిన్ జన్మించినాడు. అతని శరీరం ఉక్కు లేక 'స్టీల్' లాగ వుంటుంది కాబట్టి లెనిన్ అతనికి 'స్టాలిన్' అనే మారుపేరుపెట్టినాడని చెప్పుకుంటారు. కాదు, వెనుక ౧౯౧౦, ౧౯౧౧-వ సంవత్సరాలలో అజ్ఞాతంలో వున్నప్పుడు—లెనిన్ అతనిని ఎరుగక పూర్వమే- ఎవరో అతని కీపేరు పెట్టారని మరి కొందరనుకుంటారు.

స్టాలిన్ తండ్రి చెప్పులుకుట్టుకునేవాడు. అతనికి కొంచెం వ్యవసాయమున్ను ఉండేది. వాళ్ళది కటిక పేద సంసారం. ముసోలినీ సంసారంకూడ యింతపేదగానే వుండేది. అయినప్పటికి స్టాలిన్‌కు ఎట్లో నాలుగు అక్షరం ముక్కలు అంటినవి. ౯౪ - ౯౮ సంవత్సరాల మధ్య నాలుగేండ్లపాటు స్టాలిన్ టిప్లిస్ పట్నంలో వేదాంత మఠంలో చదువుకున్నాడు. పౌరోహిత్యానికి కావలసిన ట్రయినింగ్ పొందాడు.

స్టాలిన్ తండ్రి - హిట్లరుతండ్రివలెనే—దూర దృష్టి లేనివాడు. తనకొడుకు తనకులవృత్తి—అనగ చెప్పులుకుట్టుకుని బ్రతికేపనే—అవలంబించవలసినదని అతని

కోరిక. కాని, తల్లి యిష్టపడలేదు. కుర్రవాణ్ణి బడికి పంపించి తీరాలని తల్లి పట్టుపట్టింది. స్టాలిన్‌కు మార్క్సు సిద్ధాంతాలయందు అభిమానంమెండు. అందుకనే అతనిని మఠంనుంచి వెళ్ళగొట్టారట! ఇది నిజంకాదని కొందరంటారు. మఠంలో వుండగ, సరిగ తిండితిప్పలులేక, కుర్రవానిశరీరారోగ్యం చెడిపోవడంచేత, తల్లియే నాలుగేండ్లపాటు చదువు మాన్పించిందట!

స్టాలిన్‌తల్లి యిప్పుడు జీవించివుంది. ఆమెపేరు ఏకతెరినా. ఆమె టిఫ్లిస్ పట్టణంలోవుంది. ఆమెకు ఆ ప్రాంతపు 'జార్జియా' భాషతప్ప రష్యాభాష రానేరాదు. కొడుకును 'సోసో' యను ముద్దుపేరుతో పిలుస్తుంది. 'మాఅబ్బాయి మంచివాడ'ని అంటుంది. తన కొడుకుకు గలిగిన యింతఘనత ఏమిటో—పాపం—ఆమెకు అర్థంకాదు. కొన్నేళ్ళక్రిందట స్టాలిన్ ఆమెను 'మాస్కో' నగరానికి తీసుకువచ్చాడు. కాని, ఆమెకు అక్కడవుండడం ఏమీ నచ్చలేదు. తన 'అబ్బాయి'కి గలిగిన యీప్రాముఖ్యము, గొప్పతనం ఏమిటో తెలియక ఆమె కంగారుపడుతూ వుండేది. ఆమెకు అంతా అయోమయంగా కనపడింది. సంసారం గడవడానికి తన అబ్బాయి ఏమి పని చేస్తున్నాడో ఆమెకు అర్థంకాలేదు. అందుచేత ఆమె 'నేనిక్కడవుండన'ని చెప్పి తిరిగి టిఫ్లిస్ కొండలకు వెళ్ళిపోయింది.—కొంత సంతృప్తితో, కొంత విచారంతో—

* * *

స్టాలిన్ ఎదుర్కొనవలసిన సమస్యలు, అతిక్రమింపవలసిన కష్టములు, సాధింపవలసిన కార్యములు ఎన్నో కలవు. కారల్ మార్క్సు సిద్ధాంతముల ప్రకారమే ఫ్యాక్టరీలు, రైల్వేలు, బ్యాంకులు మున్నగు ఆధునిక పారిశ్రామిక జీవనసంస్థలన్నియును పరిపూర్ణముగ నభివృద్ధినందిన దేశముననే గాని, సామ్యవాదం జయప్రదం కాజాలదు. ఇట్టి సంస్థలు కేవలం నామమాత్రముగ నున్నప్పుడే- విషమించిన పరిస్థితులనుబట్టి- రష్యనుప్రజలు సామ్యవాదమును స్వీకరించుట తటస్థించినది.

పైగా ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ మున్నగువానివలె రష్యా చిన్నదేశం కాదు. భూభాగంలో రష్యా ఆరవవంతును ఆక్రమించుకొనివుంది. అందు వంద ప్రత్యేకజాతులు కాపురమున్నవి. అరువది భిన్నభాషలు ప్రచారంలోవున్నవి. ఇంత విస్తృతదేశమున, ఇన్ని ప్రత్యేకజాతులమధ్య ఎన్నో భిన్నభాషలు ప్రచారంలో ఉన్నప్పుడు—సామ్యవాదసిద్ధాంతాలమాట నటుంచి—ముందు ఏకార్యమైన సాధించడం సామాన్యమా ? ఇటువంటి పరిస్థితులు స్టాలిన్‌కు ఆమూలాగ్రంగా తెలియనివి కావు. అసలే, ఉక్కుమనిషి; అందులో గొప్ప సంఘనిర్మాత—అటువంటి వాని విప్లవచరిత్ర తెలుసుకొనుట మన విధి.

స్టాలిన్ పుట్టినది జార్జియా ప్రాంతము. జార్జియా భాషకు రష్యాభాషకు చాలా తేడాలున్నవి. ఈరోజువరకు కూడ స్టాలిన్ మాట్లాడే రష్యాభాషలో జార్జియా

యూస కనబడుతుంది. జార్జియనులు రష్యాఖండమునకు దాక్షిణాత్యులు. వీరిలో 'కకేసియను'ల రక్తము మిళితమైయున్నది. వీరు అనాగరికపు కొండజాతివారు. సరిహద్దుప్రాంతాలలో పరాయివారి తాకిడీలను మోటు పరికరాలతో ఎదుర్కొనుచుండే స్వభావముగలవారు. పట్టుదల, తీవ్రస్వభావము– శరీరపాటవముతోపాటు వీరిలో నాటుకొనియున్నవి. వీరు ఆర్మీనియనుజాతివారికి సన్నిహితులుగ నున్నారు. వీరికి ప్రత్యేకజాతీయాభిమానముతో కూడుకున్న చరిత్రగలదు.

* * *

మొదట్లో— అతనికి సోవియట్ గవర్నమెంటులో ఏ ఉద్యోగములేదు. కేంద్రకార్యనిర్వాహకవర్గములో (ఎగ్జిక్యూటివు కమిటిలో) గల 32 గురు మెంబర్లలో అతను ఒకడు. సోవియట్ పార్లమెంటు కిది ప్రాణతుల్యమయిన కమిటీ. సిద్ధాంతరీత్యా, మంత్రివర్గమువారు (క్యాబినెట్) ఈకమిటీకి బాధ్యులు. కాని, అతను ఈ క్యాబినెట్‌లో మెంబరుకాడు.

అత డప్పుడు జనరల్ సెక్రటరీ కూడ కాడు. అయిదుగురు పార్టీ సెక్రటరీలలో అతను ఒకడు. పార్టీపత్రిక అయిన 'పొలిట్‌బురో' (Politburo) ను నడిపించే పదిమందిలో అతను ఒకడు.

సిద్ధాంతరీత్యా ఆలోచించినట్లయితే, సెంట్రల్ కమిటీవారు స్టాలినును ఈ మెంబరు పదవులన్నిటినుండి 'బర్తరఫు' చేయవచ్చును. సెంట్రల్‌కమిటీ తీర్మానముల

కన్నిటికి అతడు బద్ధుడై యుండవలెను. కాని, క్రియల్లో అతనిని ఎవరూ 'బర్తరఫు' చెయ్యలేనిస్థితి యేర్పడ్డది. ఏలననగ, సెంట్రల్ కమిటీ యెన్నికలన్నీ అతని చేతుల లోనే వున్నవి.

పార్టీ, రాజ్యాంగము

ఈరెండు రష్యాలో క్రియకు ఒక్కటే అని చెప్పి నాను. కాని, సిద్ధాంతంలోమాత్రం వాటిని అతను వేర్వే రుగ వుంచాడు. లెనిను పార్టీనాయకుడేగాక, ప్రధాన మంత్రిగకూడ వుండేవాడు. స్టాలిను యీ రెంటిని విడగొట్టినాడు. ఈ ఉద్యోగా లేవీ స్వీకరించకుండ, తాను వెనుక సూత్రధారుడుగనుండి నడిపించాలని అతని ఉద్దే శ్యము. ౧౭ లక్షల చదరపుమైళ్ళ విస్తీర్ణంగల రష్యా ఖండానికి ఇప్పు డతడు కిరీటం లేని రాజు-సర్వనియామకుడు.

అయితే—అతను విప్లవోద్యమములో చేరడానికి రెండుకారణా లేర్పడ్డవి.

ఒకటి: అతని కటిక పేదరికం.

రెండవది: చదువుకునే రోజుల్లో మఠములో అతనికి గలిగిన అనుభవాలు. మఠములో వుండే ఉపాధ్యాయులు, గురువులు వట్టిటక్కర్లు, అహంకా రులు.—మూఢనమ్మకం గలవాళ్లు, పూర్వాచారపు పట్టు దల గలవాళ్లు—రెండవ అభిప్రాయాన్ని వాళ్లు సహిం చరు. వీళ్లు చెలాయించే అధికారంచూస్తే అతనికి ఒళ్లుమండేది. మఠంలో చదువుకున్న ఈనాలుగేండ్ల కాలము స్టాలిను జీవితములో చాల ముఖ్యమైనకాలము.

ఇదే అతని భావిజీవితపంథాను నిర్మాణము గావించినది. మఠం వదలగానే బయట 'మార్క్స' సిద్ధాంతాలతో పనిచేయుచున్న మిత్రవర్గంతో అతను చేరాడు. అప్పటి నుండి అతని విప్లవజీవితము ప్రారంభమై నేటివరకు నిరాఘాటంగా సాగిపోతూవుంది.

౧౮౯౮ మొదలు ౧౯౧౭ వరకుగల ౧౯ సంవత్సరాల అజ్ఞాతకాలములో అతను ఒక్క నిమిషముకూడ వృథాపోకుండ కృషిచేశాడు. ఆకృషిఅంతా విప్లవం కోసమే. ఒకగొప్ప విప్లవసంస్థలను నిర్మించడానికి ఎంతో ఓపికతో, పట్టువీడనిదీక్షతో పనిచేశాడు. ఎన్నో బాధలను, కొరడాదెబ్బలను భరించినాడు. కారాగారములలో క్రుగ్గినాడు. ఉరికంబముల చెంత కేగినాడు. ఇంతేనా ? కాదు ! విప్లవముకోసమే విప్లవ మొనర్చినాడు. ప్రతికక్షులను పరాభూత మొనర్చినాడు, నూత్నమానవసంఘనిర్మాణమునకు పునాదిని వేసినాడు.

హిట్లరు, ముసోలినీలు కూడ జైళ్లలోవున్నవాళ్లే- కాని, స్టాలిన్ కేవలము జైలుపక్షి అయిపోయినాడు. 'జారు' చక్రవర్తియొక్క పోలీసులు అతనిని అయిదుసార్లు పట్టుకొని, అయిదుసార్లు దేశంనుంచి వెళ్ళగొట్టారు. నాలుగుసార్లు జైలులో పెట్టారు. నాలుగుసార్లూ తప్పించుకున్నాడు. అయిదోసారి, చలిచే బిగుసుకుపోయే ఉత్తరప్రాంతంలో ఖైదుచేశారు. ౧౯౧౭ సంవత్సరమున విప్లవము జయప్రదమైనప్పుడు, విప్లవకారులు అతనిని విడిపించారు.

విప్లవదార్శన్యకార్యాలల్లో అతను తోడ్పడుతూ వుండేవాడు. పార్టీకి డబ్బు కావలసివచ్చేది. దానికోసం బ్యాంకులు కొల్లగొట్టేవారు. నిరుపేదలను కొల్లగొట్టి పోసుకున్న గుట్టలుకావా యీబ్యాంకులోని ధనము అని వారివాదము.

౧౯౦౭-వ సంవత్సరమ్ములో టిప్లిసులో జరిగిన దోపిడీకి అతనుకూడ కొంతబాధ్యుడు. ఈదొమ్మీలో సుమారు ఇరవై మంది చచ్చారు. ఒక ఓడలో కరెన్సీనోట్లు వెళ్లుతూవున్న సంగతికనిపెట్టి అతని తాలూకు మనుష్యులు ఆ ఓడమీదపడి దోచుకొని ౭౫ వేల డాలర్ల నోట్లుచేత చిక్కించుకొని, పరారైనారు. హత్యలు వలన సరంగా హెచ్చుగాచేయబడినవని చెప్పి పార్టీలోని పై అధికారులాతనిని మందలించి, కొద్దికాల మతనిని పార్టీలోనుండి వెళ్ళగొట్టినారు.

ఇన్ని జైలుశిక్షల, ప్రవాసాల మధ్య అప్పుడప్పుడతను గ్రంథాలు వ్రాస్తూవుండేవాడు. పత్రికలు నడిపిస్తూ వుండేవాడు. కాస్పియను సముద్రతీరానవున్న, బాకూ పట్నంలో 'వ్రెమియా' (Vremia) అనే బోల్‌షవిక్ పత్రికను జార్జియాభాషలో నడిపించాడు. పార్టీమీటింగుల నిమిత్తం దేశదేశాలుతిరిగాడు. ఇతర నియంత లింతగా దేశము తిరగలేదు. ౧౯౧౨ సంవత్సరం నాటికే 'సోషలిజం- జాతీయసమస్య' (Socialism and the National Question) అనే పుస్తకంవ్రాశాడు. డ్యూమ (Duma) లో సోషల్ డెమొక్రెటిక్ పార్టీకి అతడు ఈ

రోజులలో నాయకుడు—పార్టీపత్రికయైన 'ప్రవడా'కు (Pravda) అతడు సంపాదకుడు. ౧౯౧౩ సంవత్సరములో జారు ప్రభుత్వం అతనిని అరెస్టుచేసి, ఆఖరుపర్యాయము ఖైదులోవేసింది.

స్టాలిను జీవితానికిది అంతా పూర్వరంగం. ౧౯౧౭-వ సంవత్సరంలో అసలు జీవితం—ఉత్తరరంగం—ప్రారంభమైంది. ఒక్కరాత్రిలో స్థితి హఠాత్తుగ తిరిగిపోయింది. జైళ్ళలో వున్నవాళ్లు, రహస్యంగా నేల బొరియలలో కుట్రలుపన్నుచున్నవాళ్లు—వీళ్ళంతా తెల్లవారేటప్పటికల్లా రాజ్యాంగాన్ని స్వాధీనపరుచుకొని, తక్తులమీద—బైఠాయించి—కూర్చున్నారు.

* * *

వీరికిప్పుడు విప్లవము, కుట్రలు పనిగాక, రాజ్యాంగాన్ని నడిపించే బాధ్యత నెత్తిమీదపడింది. తాము రాజ్యాంగంలో అవలంబించే పార్టీసిద్ధాంతాలను ప్రతిపాదించడానికి 'పొలిట్‌బురో' (Politburo) అనే పత్రికను వీరు ౧౯౧౭-వ సంవత్సరం అక్టోబరు ౧౦-వ తేదీని స్థాపించారు. ఆరోజునుంచి కూడ స్టాలిను యీపత్రికను నడిపించే కమిటీలో మెంబరుగ వున్నాడు. తక్కిన మెంబర్లు: * లెనిను, ట్రాట్‌స్కీ, జినోవీ, కమెనవీ వగైరాలు. మంత్రివర్గము నిర్మాణమైనప్పుడు అతనికి రెండు డిపార్టు

* కాని యిప్పుడట్లుకాదు. లెనిన్ మరణించిన వెనుక సంపాదకీయవర్గం మారింది.

మెంటులు ఒప్పగించారు: కార్మికులను, కర్షకులను అజ మాయిషీచేసే డిపార్టుమెంటు ఒకటి. జాతీయనిర్మాణము చేసే డిపార్టుమెంటు రెండవది.

దరిమిలా సంభవించిన అంతఃకలహాలలో (సివిల్ వార్)లో ట్రాట్‌స్కీ అంత చురుకుగ స్టాలిను జోక్యం కలిగించుకోలేదు. ౧౯౨౧-వ సంవత్సరంలో జరిగిన సిపా యిల తిరుగుబాటును అతడు అణచివేయగలిగినాడు. దీనికి బహుమతిగ లెనిన్ అతనికి పార్టీ సెక్రటరీ పని యిప్పించాడు. దీని ఆధారంచేతనే అతను పైకి రాగలిగి నాడు.

రష్యాదేశము ఒక్కభాషతో, ఒక్కజాతి ప్రజ లతో కూడుకొన్న దేశంకాదని ఇదివరకే ముచ్చటించి యుంటిని. అచ్చట కనీసము నూరు భిన్నజాతులైనా వుం టయి. ఈభిన్నత్వం పోగొట్టి, అన్నిజాతులవారిని ఏక రష్యాజాతిగ చేయవలసిన పని అతనివంతుకు వచ్చింది గదా! దీనికి గవర్నమెంటులో ప్రత్యేకము డిపార్టుమెంటు సృష్టించి, అతనికి అప్పగించినారు. ఈపనికి అతను బాగా తగివున్నాడు, ఏలననగ: అతను స్వతహాగ శుద్ధ రష్యనుజాతివాడు గాడు—అతను జార్జియను జాతివాడని పైన చెప్పియుంటిని. కాబట్టి, రష్యనులు కాని యితర జాతులవారిని 'మనమంతా మన భిన్నత్వాన్ని మరచి పోయి ఏకరష్యాజాతి కావాలి' అని బోధచేయడానికి అతను బాగా పనికివచ్చాడు. ఆయా భిన్నజాతులకు కొం తవరకు తమ స్వయంవ్యక్తిత్వం చెడిపోకుండ కాపాడుకో

డానికి స్థానికావకాశము లిస్తూ, ఏకరష్యాజాతిని నిర్మించ వలసిన బాధ్యత అతనిమీద పడింది. ఆయారాష్ట్రము లకు స్థానికవ్యవహారములలో స్వాతంత్రం యిస్తూ మొత్తం అన్నిరాష్ట్రాలుకలిసి యావత్తు రష్యాకు 'యావ ద్రష్యా సోవియట్ రాష్ట్రమును' (U.S.S.R) గాక దానిని లెనిను ఆధిపత్యంక్రింద అతను సృష్టించాడు.

ట్రాట్‌స్కీ అంటే అతనికి మొదటినుంచి అసూయయే—అందువల్ల, కొద్దిరోజులలోనే ఇద్దరికి సంఘర్షణ బాగా ఏర్పడింది. ఒకసారి యుద్ధంలో కొంతమంది సైనికులను అసమర్థులనిచెప్పి అతను కాల్పించివేశాడు. అప్పుడు సర్వసేనాపతిగవున్న ట్రాట్‌స్కీ ఈచర్యను ఖండిస్తూ టెల్లిగ్రాముయిచ్చాడు. 'ఈ టెల్లిగ్రాము బుట్టదాఖల్' అని ఆ టెల్లిగ్రాముమీద అడ్డముగా వ్రాసి, అతను దానిని బుట్టదాఖల్ చేశాడు!

* * *

ఇంకోగాథ: పెట్రొగ్రాడ్ పట్నంలో స్టాలిను ఒకసారి శిపాయిలను వరుసగ నిలువబెట్టి అజమాయిషీ చేస్తున్నాడు. అందులో ఒకడు అతనికి సలాంచేయ లేదు. 'ఏమి సలాంచెయ్యవు' అని అతనుఅడిగాడు. ఆ సిపాయి వెంటనే తన కాళ్ళబూట్సువంక, అతని కాళ్ళబూట్సువంక చూపించాడు. వానికాళ్ళబూట్సు బురదకొట్టకొని, చినిగివున్నవి. అతని బూట్సు చక్కగ, కొత్తగ నిగనిగలాడుతూవున్నవి. అతను మారుమాట మాట్లాడకుండ తన కాళ్ళబూట్సుతీసి సిపాయికి పారేసి,

వాని కాళ్ళ మురికిబూట్సు తాను తీసికొని తొడుక్కున్నాడు. ఇట్లా ఆమురికి బూట్స్ శానారోజులు తొడుక్కున్న తర్వాత, లెనినే వాటిని బలవంతంగా తీయించి, మళ్లీ మంచిబూట్సు తొడుక్కునేటట్లు చేశాడు.

తన తర్వాత నాయకత్వానికి స్టాలిననే పెట్టాలని మొదట లెనిను అనుకున్నాడు. ఎందుకంటే- అతను జార్జియాకొండజాతివాడు కాబట్టి, ఎంతటిశ్రమకైనా ఓర్చి పనిచేస్తాడని లెనిను అభిప్రాయపడ్డాడు. 'లెనిను స్టాలినును నమ్ముతున్నాడు గాని, స్టాలిను ఎవరినీ నమ్మడు' అని ఆరోజులలో అందరు అనుకునేవాళ్లు. ఈసంగతి పైన మొదటిభాగంలో వ్రాసిన లెనిను వాక్యాలవల్లనే స్పష్టంగా తెలుస్తోంది. మరియు, 'వీణ్ణి వంటచెయ్యమంటే అతి ఘాటుపాకంచేసి తగలేస్తాడు' అన్నాడు లెనిను.

లెనిను చావగానే స్టాలిను కార్యక్రమం సాగించాడు. అతనున్ను, జినోవీయున్ను లెనిను శవాన్ని మోశారు. ఇది ౧౯౨౪-వ సంవత్సరపుస్థితి. అయిదేండ్లయేటప్పటికి పరిస్థితులు మారినవి. ఈ అయిదేండ్లలో అతను తనచేతికి అడ్డమువచ్చిన ప్రతికక్షులనందరిని కలుపుమొక్కలు ఏరి పారవేసినట్లు యేరి పారవేసి, పార్టీయంత్రాన్ని సంపూర్ణంగా తన గుప్పెటలో పెట్టుకున్నాడు. పార్టీసిద్ధాంతాలకు అర్థంచెప్పడానికి తనకుతప్ప యింకెవరికి అధికారంలేదన్నాడు. తనతో అంగీకరించని వాళ్ళంతా పవిత్రపథాన్ని తప్పి నడిచేవాళ్ళని చెప్పి స్టాలిను నిందించి తీసి పారవేసినాడు. ఈరీతిగ యావద్రష్యారాజ్యానికి

ఎదురులేని నియంతగ నేడు అతను నిలబడియున్నాడు. ఈస్థితికి రావడానికి అతనికి అయిదేండ్లు పట్టింది. మొదట ఆ అగ్నిపరీక్షకు అతడు భయవిహ్వాలుడు కాలేదు. తదుపరి, ఈవిజయలబ్ధికి అతడు గర్వీభూతుడును కాలేదు. సర్వకాలసర్వావస్థలయందును అతడు అచ్యుతుడే! అవ్యయుడే! అజేయుడే!

---

# ౩
# ట్రాట్ స్కీ

'ట్రాట్‌స్కీకి నాకు వ్యక్తిగతద్వేషాలేమీ లేవ'ని స్టాలిను అంటాడు. అయినప్పటికీ, వ్యక్తిగత విభేదాలు యేర్పడ్డమాట వాస్తవము. ఒకరినిచూస్తే ఒకరికి బొత్తిగా గిట్టదు. ఇద్దరిమధ్య పచ్చగడ్డి భగ్గున మండుతుంది. ఇద్దరు చెరివొక లోకంనుంచి వచ్చారు. మార్క్సు సిద్ధాంతాలు కూడ ఈయిద్దరిని కలపలేక పోయినవి. 'ట్రాట్‌స్కీ పై తరగతివాడు, బూటకం మనిషి' అని స్టాలిను తిట్టేవాడు. నిజమే ట్రాట్‌స్కీ సాంఘికవిషయాలలో తప్ప, తక్కిన అన్ని విషయాలలో పై అంతస్థువాడే— అతనికి గొప్పమేధాశక్తి, ధైర్యసాహసములు, మంచి నడవడి గలవు. 'స్టాలిను వట్టి అడవిమృగము. మోటమనిషి—ద్రోహి—లంచగొండి' అని ట్రాట్‌స్కీ తిట్టేవాడు.

ఇద్దరు వ్యక్తులమధ్య చెలరేగిన తుచ్ఛమైన వ్యక్తిద్వేషమనే యిట్టి అల్పవిషయము రష్యావిప్లవచరిత్రయందింత ప్రాముఖ్యము వహించుట విచిత్రము. అయినప్పటికి ఉన్నసంగతి అది. ఈవ్యక్తిద్వేషాన్ని ఇతర సందర్భములు కూడ బలపరచినవి.

స్టాలినును ట్రాట్‌స్కీ బహిరంగం కావాలని తిట్టిపోసేవాడు- అంత వొళ్లుమంట, అతనంటే ట్రాట్‌స్కీకి-

కమిటీ మీటింగులలో అతను మాట్లాడడం మొదలు పెట్టగానే, ట్రాట్ స్కీ అందరూ చూసేటట్టుగ ఒకపత్రిక తీసికొని, మొగానికి అడ్డంపెట్టుకోని, అటుతిరిగి చదువు కుంటూ కూర్చుండేవాడు.

ఉభయుల తత్వాలకు చాలా లోతైన భేదమున్న మాట నిజము.

స్టాలిను గొప్పమంత్రాంగి; కమిటీలతలలుమార్చే వాడు. ట్రాట్ స్కీ ఒంటరెత్తువాడు. ఒకళ్ళలోకలసి పని చేయలేడు. ఏపార్టీలోను చేరలేక—ఏపార్టీలోనూ అతికి ఉండలేక ఇరవై యేండ్లు అఘోరించాడు.

స్టాలిను స్తబ్ధు ; ట్రాట్ స్కీ చలాకీయైనవాడు. స్టాలిను కదలకుండ, మెదలకుండ, కూబితనంగా పొంచి వుంటాడు.

ట్రాట్ స్కీ నిర్మొగమోటంగా లొడలొడ మా ట్లాడేస్తాడు. స్టాలిను బాంబులు విసురుతాడు. ట్రాట్ స్కీకి పొంచుండి తుంటరితనంగా దౌర్జన్యం చెయ్యడం గిట్టదు. స్టాలిను వెనుకనుండి సూత్రాలులాగి నాటకం ఆడిస్తాడు: తన పేరుప్రతిష్ఠలు పైకిరావాలని అతనికి గాఢమైన కోర్కె, అతడు బ్రతుకనేర్చినవాడు.

ట్రాట్ స్కీ ఉద్రేకి- సిద్ధాంతవాది, బడాయికోరు. స్టాలిను గొప్పనిర్మాత; ట్రాట్ స్కీకి రాచకీయతంత్రాలు బొత్తుగ తెలియవు, సిద్ధాంతాలు సడలించి పనిచేయ లేడు, అతనితో రెండోవాడు కలిసి పనిచేయడంకష్టం.

వాళ్ళ నవ్వులలోనే తేడావుంది. గమనించాలే

గాని—స్టాలిను నవ్వితే అప్పుడే వేటనుమ్రింగిన పెద్దపులి మొగంవలె వుంటుంది. ట్రాట్‌స్కీ నవ్వు పసిపిల్లాడు నవ్వినట్లుంటుంది. సైబీరియానుంచి తప్పించుకు పోవడం లోకూడ యిద్దరికి తేడాలున్నవి, స్టాలిను జాగ్రత్తగ, ఎవరికి తెలియకుండ పారిపోయినాడు. ట్రాట్‌స్కీ అందరికళ్లా పడ్డాడు, గాలిలో పైకి ఎగురుతున్న పటం లాగ.

* * *

వ్యక్తిగత విషయములలోనే గాకుండ, రాచకీయా భిప్రాయాలలో కూడ ఉభయులకు చాలా పెద్ద తేడాలు న్నవి. సోవియట్ రాజ్యాంగాన్ని నడిపించడంలో ఇవి ఒకటి నొకటి ఎదుర్కొన్నవి. 'మనదేశం సంగతి మనం చూసుకుంటే చాలులే!' అని స్టాలిను ఉద్దేశం. 'అట్లా గాదు, లోకంలో మనం కేటాయింపుగ ఉండడానికి వీలు లేదు- ప్రపంచంలోవున్న తక్కినదేశా లన్నీకూడ మన విప్లవమార్గానికి వస్తేనేగాని, మనరష్యాలోనైనా సోవి యటురాజ్యపద్ధతి నిలవద'ని ట్రాట్‌స్కీ అభిప్రాయం.

లెనిను మరణానంతరం జరుగుతున్న సంగతులు చూస్తే, ట్రాట్‌స్కీవర్గం వారికి కంపం పుట్టింది. ధనిక వర్గాలవారిని కొంత శాంతి పరుచుటకై లెనిను తాత్కా లికముగ ఒకనూతనఆర్థికవిధానాన్ని సూచించాడు. ఇదే ఎల్లప్పుడు స్టాలిను సాగించేటట్లుగ ట్రాట్‌స్కీ పార్టీవారికి కనిపించింది. యావత్తు రాజ్యాంగాన్ని కమ్యూనిస్టు పద్ధ తిలోకి మార్చే విషయంలో పని అతిమందంగా జరుగు

తొందని వీరివాదన. దేశంలో పని యింత మందకొడిగ చేస్తూ, ఇతర దేశాలలో కూడ ఏమీ ప్రచారం లేక పోతే, కమ్యూనిజం అసలే చచ్చిపోతుందేమోనని వీరి భయం.

ఆనియంత ఈ అభిప్రాయాలతో ఏకీభవించలేదు. 'ఓ! బయటి దేశాల అబ్బాయిలూ, మీరాత్రే తొందర పడకండి- ఓయిరవై యేళ్ళపాటు ఓపికపట్టండి- అప్పుడంతా ఒకత్రోవకు వద్దాము' అంటాడు అతను. 'కాదు, బయట దేశాలవాళ్ళంతా ఇప్పుడే మాతో కలియండి— మీమీ దేశాలలో ఇప్పుడున్న ధనికరాజ్యాల నన్నిటిని యిప్పుడే కూలద్రోసి, మాద్రోవకురండి' అంటాడు ట్రాట్‌స్కీ—

ముందు మనయిల్లు చక్కచేసుకుంటే, తర్వాత పరాయివాళ్ళకు సహాయంచేయవచ్చు నంటాడు అతను. మన యిల్లేమిటి? ఎవడిల్లు వాడికేముందు, కాబట్టి, అంతా వొక్కసారే జరగాలంటాడు ట్రాట్‌స్కీ—'ఇతరుల సంగతి మనకెందుకు, మనదేశంతోటే సంతృప్తిపడి కూర్చుందా మంటాడు స్టాలిను.

'కాదు, ప్రపంచాన్నంతా మనద్రోవకు తీసుకురావాలి. అన్ని దేశాల్లో మనం తాండవనృత్యం తొక్కాలంటాడు' ట్రాట్‌స్కీ.

కాని, నిజస్థితిచూస్తే, స్టాలినుమాట సరియైనట్లున్నది. అతను పెట్టిన పంచవర్ష ప్రణాళిక జయప్రదంగా సాగింది. ఇదే స్టాలినుమాటకు ఋజువు. ట్రా

ట్‌స్కీని దేశాన్నుంచి వెళ్ళగొట్టక పూర్వం, ఏడేండ్ల క్రిందట, ఈప్రణాళిక యింత జయప్రదంగా సాగుతుందని యెవరనుకున్నారు? ఇప్పు డంతా చెప్పవచ్చు! స్టాలిను యొక్క దూరదృష్టికి, పట్టుదలకు అతిన్ని అభినందించక తప్పదు.

ఉద్యమం అతిత్వరగా పోతోందన్నవాళ్లను ఏ పద్ధతులమీద ఎదిర్చి చెదరగొట్టాడో అతిమందంగా పోతోందన్న ట్రాట్‌స్కీ వర్గాన్నికూడ అదేపద్ధతిని స్టాలిను చెదరగొట్టి వేశాడు. ఆపద్ధతులు రెండు: (౧) పార్టీయంత్రాన్ని స్టాలిను తన గుప్పిటలో పెట్టుకున్నాడు, (౨) 'లెనినిజం'కు అతడు చెప్పినఅర్థంవల్ల అతని ఎదిరి కక్షువా రందరు ద్రోహులై పోయినారు. కాబట్టి, శిక్షా పాత్రులై పోయినారు.

ట్రాట్‌స్కీ రష్యాదేశాన్నుంచి వెళ్ళగొట్టబడి, యిప్పుడెక్కడనో ప్రవాసంలో వున్నాడు. అతడుకూడ పార్టీని లేవదీశాడు. దానికి అమెరికాధనికులు మద్దతు చేస్తున్నారు. వారే ట్రాట్‌స్కీవ్రాసిన పుస్తకాలుకొని, అతనికి డబ్బిస్తున్నారు. దీనినిబట్టి చూస్తే, ట్రాట్‌స్కీ ధనికవర్గాలవాళ్ళ వశమైపోయి కమ్యూనిజం సిద్ధాంతా లకు ద్రోహియైనాడని స్టాలిను లోగడచేసిన నిందకు, ఈమధ్యచేసిన వాటిని బట్టి కాకతాళన్యాయంగా బలం కలుగుతోంది.

* * *

ట్రా స్కీమీాద కసిచేత స్టాలిను చాలా కఠినంగా

ప్రవర్తించాడు. అతనిపేరు భవిష్యత్సంతతివాళ్ళ కెవరికి తెలియకుండ మాపివేయాలనిచెప్పి, అన్ని రికార్డులలోను, స్కూలు పుస్తకాల్లోను అతనిపేరు కొట్టించివేశాడు స్టాలిను! కాని, ఈఉద్దేశ్యం నెరవేరుతుందా? 'అక్టోబర్ విప్లవం'—అనే పుస్తకంలో స్టాలిను అతని సేవను గురించి ఉగ్గడించక తప్పిందికాదు. 'అక్టోబరు విప్లవంలో కామ్రేడ్ ట్రాట్స్కీ బాగా పోరాడినాడని వొప్పుకోనక తప్పదు'—అని విధిలేక స్టాలినే వ్రాయవలసి వచ్చింది.

ట్రాట్స్కీమీద స్టాలినుకు కోపం ఉండడాని కొక తమాషా కారణముంది. ప్రపంచంలో సాధారణంగా ఇది జరుగుతూవుంటుంది. ప్రథమంలో ట్రాట్స్కీ వేసిన స్కీమునే స్టాలిను దొంగిలించినాడని చెప్పవచ్చును. ఈ దొంగతనాన్ని కప్పిపుచ్చాలనే ఈర్ష్యయే స్టాలినుకు గలిగిన ద్వేషభావానికి కారణం. స్టాలిను అమలుజరిపిన పంచవార్షికప్రణాళిక ౧౯౨౧ సంవత్సరంలో ట్రాట్స్కీ చెప్పినదే. ధనికులగు రైతులను వెళ్ళగొట్టవలసినదని ట్రాట్స్కీ ౧౯౨౪ సంవత్సరంలోనే చెప్పాడు. ఈ పని స్టాలిను అయిదేండ్లదాకా చెయ్యలేదు. ట్రాట్స్కీ కాలం పక్వంకానిదే తొందరతొందరగ పనికావాలన్నాడు. కాని, స్టాలిను కాలం అనుకూలించేవరకు ఓపిక పట్టగలిగాడు.

ఒక్క రష్యాదేశంలో ఈపని సంపూర్తిగచేసి చూపిస్తానని స్టాలిను అంటే, ట్రాట్స్కీ దానిఅర్థం గ్రహించలేక పోయాడు. రష్యాఅంటే వొక్క చిన్న

దేశామా? పెద్దఖండము గద! ఈమాత్రం ట్రాట్‌స్కీ గ్రహించ లేకపోయాడు. రష్యావంటి నానాగోత్రము లతో, జాతులతో, భాషలతో కూడుకొన్న ఖండములో కమ్యూనిజం చక్కగా, సుస్థిరంగా జయప్రదం, అయిందంటే,—ప్రపంచంలో కమ్యూనిజంకు ఎంతపేరు ప్రఖ్యాతులు, పలుకుబడి, మహత్తరమయిన శక్తి వస్తుందో ట్రాట్‌స్కీ గ్రహించలేకపోయాడు. రష్యాలో జయప్రదం అయిందని చూపిస్తే, ఇతర దేశాలలో వేరే ప్రచారం అవసరంలేకుండ, దానంతటదే పాకిపోదా?

## ౪

# రష్యా రైతులు

బాగా పంటపండే ప్రాంతములలోనే ౧౯33-వ సంవత్సరములో కరువువచ్చింది. ఈసంగతిని కమ్యూనిస్టులు తుట్టతుదకు ఎంతో అయిష్టంతో వొప్పుకోక తప్పిందికాదు. ఈకరువులో ౫౦ లేక ౬౦ లక్షల జనం చచ్చారు.

అయితే ఈ కరువులో మనం గమనించవలసిన సంగతి ఏమిటంటే—ఎంతమంది చచ్చారని కాదు-అసలు కరువుఅనేది ఎందువల్లవచ్చింది అనేవిషయం ముఖ్యమైనది.

రైతులకు ఉత్తరోత్తరా క్షేమంకలిగే నిమిత్తం, విడివిడి వ్యవసాయం తీసివేసి, యావత్తు భూమిని రాజ్యాంగమే స్వాధీనపరుచుకొని, దీనిని ఉమ్మడి వ్యవసాయం చేయించాలని సోవియట్ గవర్నమెంటువారు పూనుకున్నారు.

ఈపూనికను రైతులు ఎదిరించారు. తత్ఫలితంగా ఘోరబాధలు అనుభవించారు.

గవర్నమెంటును చిక్కులలో పెట్టాలనే చప్పనాతితనంచేత రైతులు పండినపంటనే కోయకుండా ఊరుకున్నారు. అందువల్ల తిండికిలేక మాడి చచ్చారు.

అయితే, అసలుకథయిది: విడివిడి వ్యవసాయం తీసివేసి భూమిని ఉమ్మడివ్యవసాయం చేయించాలనేది పంచవర్ష ప్రణాళికలో వొకటిగ ఉండెను. రష్యా ముఖ్యముగ వ్యవసాయ దేశము.

౧౯౨౭-వ సంవత్సరమునాటికి ౨ కోట్ల ౫౦ లక్షలమంది చిన్నరైతు లుండిరి. ఈచిన్నచిన్న ఖండాలనన్నిటిని కలిపి పెద్దఖండాలుగచేసి ఉమ్మడివ్యవసాయం చేయించాలని స్టాలిన్ ప్లాను. వొక్కొక్క పెద్ద ఖండానికి గవర్నమెంటుతరఫున వొక మేనేజరు ఉంటాడు. చిన్న రైతులు తమ పశువులను, నాగళ్లువగైరా వ్యవసాయ పరికరాలను ఆమేనేజరుకు అప్పగించాలి. అంతా కలిసి ఉమ్మడిగ ఈఖండంమీద పనిచెయ్యాలి. గవర్నమెంటువారు వీరికి సహాయంగా పెద్దపెద్ద మోటారు యింజనులను (ట్రాక్టర్లను) సప్లయిచేస్తారు.

ఇదీ ప్లాను. దీనిమీద సోవియటు రాజ్యాంగము యొక్క 'సోషలిజం' (సామ్యవాదసిద్ధాంతం) నిలిచివున్నది.

ఈ ఉమ్మడివ్యవసాయపుస్కీము గవర్నమెంటువారు బలవంతంగా ప్రవేశపెట్టారు. రైతులు రెండుపర్యాయములు చాలా గందరగోళముగ, తీవ్రముగ ఎదిరించారు. "మాపశువులను గవర్నమెంటు మేనేజరుకు అప్పగించడంకంటే, వాటిని చంపివేసేస్తామని చెప్పి, రైతులు వాటిని నరికి పారవేసుకున్నారు!

ఇది అపూర్వము, విషాదకరము అయిన

క్రూరకృత్యము.

దరిమిలావచ్చిన కరువువల్ల మనుష్యులే చచ్చిపోయిన సందర్భము యింతకంటె ఘోరముగా వున్నది.

రైతులలో సంఘాలు లేవు; వొక ప్రాంతంవారికి ఇంకొక ప్రాంతంవారికి రాకపోకలు, ఉత్తరప్రత్యుత్తరాలు లేవు—అయినా, ఎట్లాగో, దేశం అన్నిప్రాంతాలలో వొక్కసారిగ ఈకసాయిపని జరిగిపోయింది. తమ పందులు, గొర్రెలు, గొడ్లు—వీటినన్నిటిని—'మేము గవర్నమెంటుకు అప్పగిస్తామా? వీటిని నరికన్నా పారవేస్తాముగాని, గవర్నమెంటుకుమాత్రం అప్పగించము' అని రైతులు చెలరేగి, వాటినిఅన్నిటిని నిర్దాక్షిణ్యంగా నరికి పారవేసుకున్నారు!

ఇది చాలాఘోరమైన సంగతి. కోరినఫలితాని కిది వల్లమాలిన బలిమైనది. నాలుగేండ్ల తరువాత స్టాలినే ఈసంగతి ఒప్పుకున్నాడు. ఏదో చేయబోతే, ఏదో అయింది. ఈదెబ్బనుండి రష్యా కోలుకోడానికి ౧౯౩౦-వ సంవత్సరంవరకు పట్టుతుంది. చంపిన పసువులను మళ్లా భర్తీ చేసుకోడానికి అంతకాలం పడుతుంది. ఒక్కసారి యీనరుకుడు ప్రారంభంకాగానే, దేశంలోవున్న పసువులు సగానికిసగం తెగేవరకు ఎవరూ వెనుకకు తిరగ లేదు (గవర్నమెంటుమీదకోపం రైతులు నోరులేనిజంతువులమీద చూపించారు!)

ఈవిధంగా సగందూరం పోయేటప్పటికల్లా రైతులకు కండ్లు తిరిగిపోయి వారితల దిమ్మెక్కి వారు నిశ్చే

ష్టులైపోయినారు!—గవర్నమెంటుకూడ తెల్లబోయి, చల్లచల్లగ వెనుకకు జారింది. అంతా మించిపోయేదాకా స్టాలిన్‌కు తెలియలేదు—ఇంత ఘోరవధ జరుగుతోందని. ఉమ్మడిఖండాలు చేయడమనేస్కీము వెంటనే అమలుజరపాలని అతి తొందరపడ్డాడు ఆనియంత. మొదట పదేండ్లలో కావాలనుకున్న పనిని రెండుమూడేండ్లలోనే చేసివేయాలని అతడు తొందరపడ్డాడు. రెండేండ్లకే నూటికి ౬౫ చిన్నఖండాలు పెద్దఖండాలైపోయినయి. అందువల్ల ఈదుష్ఫలితంకలిగింది. తరువాత తొందర తగ్గించుకొని నెమ్మదిగ వ్యవహరించారు.

అయినప్పటికి ౧౯౩౭-వ సంవత్సరములో రైతులు మళ్ళీ తిరగబడ్డారు. కాని, తుదకు ఫలితం లేకపోయింది. ఉమ్మడివాళ్ళొక ఎత్తువేశారు వ్యవసాయంలో చేరనివాళ్ళ ధాన్యానికి ధరలులేకుండ పోయినవి. అందుచేత పండించిన పంట అంతా నూర్చుకుని యిండ్లలో పోసుకోకుండ, తమతిండికి కావలసినవి మాత్రం యింటికి చేర్చుకొని, తక్కినకుప్పల నన్నిటిని పొలంలోనే వదిలేసి ఊరుకున్నారు. 'గవర్నమెంటు లాక్కుపోయేదానికి మేమెందుకు చాకిరీచెయ్యాలి' అనిచెప్పి, మొదలకండ ఊరుకున్నారు రైతులు.

ఈవిధంగా, పంట మహస్సాలుచేయక పోతే, గవర్నమెంటుకు ధాన్యంముట్టక, గవర్నమెంటే మాడిపోతుందని వెర్రిబాగుల రైతులు అభిప్రాయపడ్డారు.

పెద్దపెద్ద పట్టణాలలో పారిశ్రామికులకు పంచి

పెట్టడానికిన్నీ, పరదేశాలకు ఎగుమతిచేసి అక్కడనుండి దేశానికి - పంచవర్ష ప్రణాళిక - కావలసిన యంత్రాగిక పరికరాలను తెప్పించుకోడానికి. గవర్నమెంటుకు ఎంతో ధాన్యం కావాలి, ఉమ్మడి ఖాతాలలో చేరిన రైతులు కూడ మాసూళ్లుచేయక పొలాలలోనే వదలివేశారు. ఇట్లా జరగకుండ చేయడానికి తగినంతమంది మేనేజర్లు వగైరా శిబ్బందిని గవర్నమెంటు పెట్టలేకపోయింది. 'ఈసంవత్సరం పంట పుష్కలంగా పండిందిగాని, అంతా పొలాలపాలైపోయింద' నేవార్త మాస్కో రాజధానీనగరానికి చేరింది 'అబ్బో! గొప్పచిక్కువచ్చిందే' అని నియంత తలతడివి చూచుకున్నాడు.

'రైతులను యిట్లావదిలివేస్తే, యిక తమప్లాను సాగద'నుకున్నాడు అతడు. కాబట్టి, దీనికి ఏదోగట్టిగ పని చేయాలని సంకల్పించాడు.

రైతులు తమకోసం మిగుల్చుకున్న ధాన్యం యావత్తు పట్టుకొని తీసికొనిరావలసిందనిచెప్పి, స్టాలిన్ తన తాబేదార్లను దేశంమీదికి పంపించాడు. వాళ్లు మిడతల దండ్లవలె పొలాలవెంట, గ్రామాలవెంట పడి యావత్తు ధాన్యాన్ని లంకించుకొని, మాస్కోనగరానికి తోలించుకు వచ్చారు. సాలుపొడుగున తిండికి గింజలులేక రైతులు మాడిచచ్చారు. రష్యాలో ఏసాలుపంట ఆసాలునే ఆఖరు. ఏఒక్క సంవత్సరమైనా పంట లేకపోతే, రైతులు మాడవలసినదే. కూడబెట్టుకునే శక్తి వాళ్ళకు లేదు. ఇది అప్పట్లో రష్యా ఆర్థికస్థితి.

నగరాలలోవుండే ధాన్యాన్ని కొంత గ్రామాదులకు మళ్ళిస్తే బాగుండేది. కాని, స్టాలిన్ అట్లా చేయదలచుకోలేదు. రైతులు చేసిన తిరుగుబాటుకు వాళ్ళను ఈ రీతిగ శిక్షించాలని చెప్పి అతడు సంకల్పించాడు. 'రాజ్యాంగానికి ధాన్యంలేకుండ మాడ్చాలని వాళ్ళకు దుర్బుద్ధి పుట్టింది సరే, వాళ్ళనే యిప్పుడు మాడనీ' అని చెప్పి అతడూరకున్నాడు. అంతటితో రైతులు మాడారు.

ఇక, ధనవంతులగు రైతులపనిని ఆనియంత పట్టించాడు. వీళ్ళను సరాసరి హతమార్చాడు. ౧౯౨౮-వ సంవత్సరంనాటికి ఈధనాఢ్య భూస్వాములు ౭ లక్షల ౫౦ వేలమంది ఉన్నారు. ఈరోజున ఒక్కరూలేరు. వీళ్ళనందరిని- చెట్లను గ్రుంకుటవేళ్ళతో పెళ్ళగించినట్లు పెళ్ళగించి —జైలుబస్సులలో ఎక్కించి కూరి, దూరంగా తీసికు వెళ్ళి ఎక్కడనో కూలీగ్యాంగులలో పడనూకించాడు. వాళ్ళచేత కాల్వలు త్రవ్వించాడు, రైలురోడ్లు వేయించాడు—రాళ్లు పగలగొట్టించాడు- నానావిధములైన శరీరకష్టాలు చేయించాడు.

కరువువల్ల చిన్నరైతాంగమంతా లొంగుబాటులోకి వచ్చారు. ఈకరువు అనంతరం ఉమ్మడి స్కీము నెమ్మదిగ, ఒడుదుడుకులు లేకుండా సాగింది. ౧౯౩౦-౩౫ సంవత్సరాలమధ్య నూటికి ఇంకొకపాతిక భూమి ఉమ్మడి స్కీము క్రిందకి వచ్చివేసింది. సాగుకు లాయఖు అయిన భూమియావత్తు రష్యాలో యిప్పుడు రెండున్నర లక్షల పెద్దఖండాలుగ చేయబడింది.

మొదట రైతులు తిరుగబాటు చేసినమాట వాస్తవమే. ఆతిరుగుబాటు జయప్రదమైయుంటే సోవియట్ రాజ్యము కూలిపోయేదే—కాని, స్టాలిన్ యొక్క వజ్ర సంకల్పంవల్ల ఈఆపత్తు తప్పింది. తన సంకల్పమనే వజ్రాయుధంతో రైతుల తిరుగుబాటును విరుగగొట్టి పారవేసినాడు.

రైతులు తమ పశువులను చంపుకున్నారు. తరువాత తామే చచ్చారు, అంతే!

రష్యా రైతులు

## ౬
# ఆధునిక సంఘనిర్మాత

స్టాలిన్ దారిదోపిడి దొంగకాదు. అతడు పెద్ద పండితుడనీకాదు. అయినప్పటికిని కావలసిన డొక్కశుద్ధి వుంది అతనికి. ముఖ్యముగా చరిత్ర, వేదాంతం, వగైరా లలో చాలావరకు చదువుకున్నాడు.

అతనికి విగ్రహపుష్టేగాని, తలలో మెదడులేదని అతనిని చూచినవాళ్లు చప్పున అనుకుంటారు. కాని, అతని ఉపన్యాసాలలో ప్లేటోవగైరా ప్రసిద్ధుల వాక్యాలు దొర్లుతూవుంటాయి. అమెరికా, ఇంగ్లండు రాజకీయాలు అతనికి బాగా తెలుసు.

౧౯33-వ సంవత్సరంలో బోల్షివిక్ కవులువస్తే, ఛీ, చీ, మీరువ్రాసేదంతా చెత్త- నేను చేస్తున్నట్లుగ మీరుకూడ షేక్సుపియర్, గెటీ—మొదలైన గొప్ప వాళ్ళ గ్రంథాలు చదవండి—పొండి' అని వాళ్ళను చీవాట్లుపెట్టి పంపించేటప్పటికల్లా వాళ్లు డంగైపోయారు.

పరాయి పెద్దమనుష్యులతో మాట్లాడేటప్పుడు మర్యాద మన్ననలకు లోపంలేదు. ఇతరులను అసలు తరుచుగ చూడడు. కాని, అతనితో మాట్లాడిన వాళ్లు మాత్రం అతని మర్యాదకు, మాటల పొందికకు మెచ్చుకుంటారు.

తనకు శత్రువర్గమైన ధనికులను కూడ ఆట్టే తూలనాడడు. వాళ్ళనుగురించి కొంచెము వ్యంగ్యంగా, పరిహాసంగా మాట్లాడుతాడు.

అతడు బయటికి ఆట్టేరాడు. ఒకసారి పద్ధెనిమిది నెలలవరకు అతడు బయట ఎవరికి కనబడలేదు. ఒక ఉపన్యాసం యివ్వలేదు. ఇంత ప్రశాంతస్వభావంలో ఉండే నియంత అత డొక్కడే.

ఇతనిలో కొంత హాస్యరసంకూడాఉంది. పాశ్చాత్యుల కది కొంచెం మోటుగ ఉండవచ్చు.హిట్లర్ ముసోలినీలకు అసలు హాస్యమనేదే లేదు. ఇదే వారికీ స్టాలిన్‌కు తేడా!

౧౯౩౦-వ సంవత్సరంలో సోవియటు కాంగ్రెస్‌లో తన ప్రతికక్షికి చెందిన యిద్దరు వ్యక్తులను గురించి —(అనగా బుకారిన్, రికోవ్ అనువారినిగురించి) స్టాలిన్ ఈదిగువరీతిగ హేళనచేశాడు:—"మన బుఖారిన్ వట్టి పిరికివాడు. బొద్దంకినిచూస్తే ఉలికిపడి- 'యింకేముంది, మనసోవియట్‌రాజ్యం రెండు నెలలలో కూలిపోతుం'దంటాడు! ఇక, మన రికోవో—యితనిమాటలను ఎంతమాత్రం అంగీకరించడు. ఇద్దరికి గొప్ప అభిప్రాయ భేదం ఉంది లెండి- అదేమిటంటే—సోవియటు రాజ్యం రెండు నెలలోగాదు—రెండునెలల రెండు రోజులలో కూలిపోతుందంటాడు మన రికోవ్! ఇదీ యిద్దరికీ గొప్ప తేడా!"

* * *

స్టాలిన్ అప్పుడప్పుడు నమ్రత నటిస్తాడు.

'ప్రపంచాన్ని మరామతు చేయడానికి ఏమిచేస్తున్నావయ్యా నువ్వు?' అని ఒకాయన (వెల్సు) స్టాలిన్‌ను అడిగాడు.

'ఎబ్బే! అంత ఎక్కువగ ఏమీచేయడంలేదండీ—మేమే తెలివిగలవాళ్ళమైతే, ఇంకా ఎంతో చేసిఉందుము'—అన్నాడు స్టాలిన్ నమ్రతగ. హిట్లర్, ముసోలినీలు ఎప్పుడుకాని యింత వినయపుమాట అంటారా!

ప్రజలు తనను దేవతగ పూజిస్తూవుంటే, స్టాలిన్ చూసీచూడనట్లుగ లోలోన సంతోషిస్తూ వూరుకుంటాడు. 'కానీండి' అని కొంచెము కన్నుకూడా గీటుతాడు.

లెనిన్ బొమ్మలతోపాటు స్టాలిన్‌బొమ్మలుకూడ ఎక్కడబడితే అక్కడ కనబడతయి. మాస్కోనగరంలో రాత్రిళ్ళు—నాటకాలప్రకటన వలె- స్టాలిన్‌బొమ్మలు దీపాలముందు కొట్టవచ్చినట్లు అందరికీ కనబడుతూ వుంటుంది.

ఇదంతా ఆపాలంటే స్టాలిన్ ఆపించగలడు. కాని, అట్లా చెయ్యడు ఎందుకంటే, తన ఈప్రాచుర్యం తన రాజకీయాధిక్యతను పెంపొందించుకొనుటకు ఉపయోగపడుతుందని అతని ఆశ.

రష్యా ప్రజలు తమనాయకులందు భక్తిగలవారని ఆతనికి తెలియదు.

మాస్కోనగరంలో 'క్రెమ్‌లిన్' అనేచోట అతని కాపురం. అది పెద్ద భవంతి కాదు. వట్టి పెద్ద కాంపౌండు

చుట్టు కోటగోడవలె ఆవరణవుంటుంది. దీనిలో ४० లేక ५० యిళ్లున్నయి. అందులో కొన్ని చర్చీలు, కొన్ని బార కీచులువున్నయి. వీటిలో స్టాలిన్ క్రింద మూడుగదులు మాత్రంవుంటయి. కొందర నుకునేటట్టు అతడెప్పుడు అందులో కూర్చుని పనిచేయడు. బయట ఇంకోచోట తన పార్టీయొక్క సెంట్రల్ కమిటీగదిలో కూర్చుని పనిచూసుకుంటూ వుంటాడు.

ఒక పల్లెటూరిలో అతని కొక యిల్లుంది. స్టాలిన్ అక్కడకూడ వుంటూ వుంటాడు. మాస్కోనుంచి అక్కడి కొక గంట ప్రయాణం. ఈయిల్లు వొకప్పుడు వొక కోటీశ్వరుడిది. అతడు బంగారువర్తకం చేసేవాడు. ఇతరులువచ్చి తనను దోచుకుంటారేమో అనే భయం అతనికుండేది. అందుచేత తన పదిఎకరాల ఎస్టేటుకు చుట్టూ పెద్దగోడ పెట్టించుకున్నాడు. స్టాలిన్ స్వాధీనంలోకి వచ్చినతరువాత ఆగోడను పగులగొట్టించకుండ అట్లాగే ఉండనిచ్చాడు. ఆ ప్రాంతమంతా మంచి బందోబస్తుగ కాపలా పెట్టాడు.

అక్కడనుంచి మాస్కోపోయే రోడ్డుమీదకూడ పోలీసుఘాటు వుంటుంది. స్టాలిన్ బయలుదేరితే మూడు కార్లు బయలుదేరుతయి. అతడు సాధారణంగా డ్రైవరు ప్రక్కనే తనయిష్టంవచ్చిన కారులో కూర్చుంటాడు. ఇవ్వాళ్ళకూర్చున్న కారులో రేపుకూర్చోడు. ప్రక్కరోడ్డు మీదనున్నజనం తొలగవలసినదని మర్యాదగ చెప్పుకుంటూ పోతవి కార్లు.

హిట్లర్, ముసోలినీలకున్నంతపారా – అంగరక్ష – స్టాలిన్‌కులేదు. అనేకసార్లు కాలినడకను స్నేహితులతో మాట్లాడుకుంటూ, కిటకిటలాడే జనంమధ్యనుంచి స్టాలిన్ ఇంటికి వస్తూవుంటే అనేకమంది చూస్తూవుంటారు. సంవత్సరానికి కనీసం రెండుసార్లు మే ౧, నవంబరు ౭-వ తేదీలలో స్టాలిన్ లెనిన్ సమాధిమీదనుంచుని మాట్లాడుతాడు. అవి రెండు సోవియటు రాజ్యాంగానికి శెలవ రోజులు. ఆరోజున లక్షలకొద్దీ జనం అతన్ని దాదాపు రాచుకుపోతూ వుంటారు.

* * *

స్టాలిన్‌కు డాబు దర్పాలులేవు; యూనిఫారమయిన వేసుకోడు. నల్లని ఆకుపసుపు ధాళుగల జాకెట్టు, దానికి మెడదగ్గరగుండీలు, స్వారికిపనికివచ్చే కోటు; బూట్సు– ఇది, అతని డ్రెస్. బయటికిపోయినప్పుడు నెత్తినటోపీ, దానికో ముసుగు వుంటుంది. ఇది గవర్నమెంటు విధించిన డ్రెస్ కాదు. అయినప్పటికి, దేశంలో శానామంది ఈ మాదిరిగానే డ్రెస్ చేసుకుంటారు. ఇతని ఇచ్ఛకాన్ని సంపాదించుకోవడానికి చాలామంది ఉద్యోగస్తులు, పార్టీలో మెంబర్లు ఈవేషమే వేసుకుంటూవుంటారు.

స్టాలిన్ సాధారణంగా ఏకబిగిని నాలుగైదు రోజులు పనిచేస్తాడు. తర్వాత తన పల్లెపట్టుకు వెళ్ళి ౨, 3 రోజులు హాయిగా విశ్రాంతి తీసుకుంటాడు.

ఎక్కువ వినోదాలకు, ఆటలకు వెళ్ళడు. అయినా అప్పుడప్పుడు సినీమాలకు, నాటకాలకు వెళ్ళి వస్తూ

వుంటాడు. నచ్చిన సినీమావుంటే ౭, ౫ సార్లుకూడ వెళ్ళి చూస్తాడు. సివిల్ యుద్ధాలకు సంబంధించిన సినీమాలను నాలుగుసార్లు చూస్తాడు.

చాలా పుస్తకాలు చదువుతాడు.

అప్పుడప్పుడు చదరంగం ఆడుతాడు.

ఎప్పుడూ చుట్టలు తగలేస్తూవుంటాడు. 'ఎడ్జివర్తు' పొగాకంటె అతనికి మహాప్రీతట. అయితే చిక్కేమంటే ఇది స్వదేశీ పొగాకు కాదు. పరాయిదేశానిది. అందుకని బహిరంగంగా ఈపొగాకుచుట్ట కాల్చడానికి స్టాలిన్ కొంచెం జంకుతూవుంటాడు. భోజనందగ్గర కూర్చున్నప్పుడు కూడ చుట్టగొట్టం ప్రక్కనఉండాలిసిందే. వాయివాయికి మధ్యను ఒకగుక్క పీల్చాలిసిందే.

బ్రాందిఅంటే మహాయిష్టం- బాగా తాగి హరాయించుకోగలడు.

స్త్రీవిషయంలో లోలత్వంలేదు. సాధారణం. అతడు రెండుసార్లు పెండ్లిచేసుకున్నాడు. ఇప్పుడు తన సహోద్యోగి చెల్లెలితో వుంటున్నాడట. అతని ప్రణయ రహస్యాలు వేఱొక ప్రకరణంలో వివరిస్తాను.

మొదటిపెళ్లాంసంగతి ఎవరికీ బాగా తెలియదు. అదంతా విప్లవానికి పూర్వచరిత్రలో మరుగుపడిపోయింది. ఆమె ౧౯౧౭-వ సంవత్సరములో ఊపిరితిత్తుల జబ్బువల్ల చనిపోయింది.

ఆరోజులలో పెళ్ళిళ్ళ వ్యవహారాలలో కూడ తిరుగుబాటు జరిగింది. పూర్వాచార పద్ధతులు కఠిన

నియమాలు అంతగా పాటించదలచినవారెవరూ లేరు.

మొదటిభార్యవల్ల స్టాలిన్ కొక కొడుకు. వాడి కిప్పుడు పాతికేండ్లుంటాయి ; కాని, ఆస్టే అక్కరకు రాలేదు. స్కూలులో సరిగ వుండేవాడుకాడు. ఎవరి తోనో గోలీకాయ లాడుకుంటూ కూర్చునేవాడు. తండ్రికి విసుగెత్తి వాణ్ణి టిప్లిన్ పట్నంలో ఒక ఫ్యాక్టరిలో పని చెయ్యమని చెప్పి గెంటివారేశాడు.

౧౯౧౯-వ సంవత్సరంలో లెనిన్‌గ్రాండు పట్నంలో ఒక పూర్వస్నేహితుణ్ణి-తాళీలుచేసే కార్మికుణ్ణి-చూడ్డానికి వెళ్లాడు స్టాలిన్. ఆస్నేహితుడి కొక ౧౭ ఏండ్ల కూతురుంది. ఆ అమ్మాయి పేరు నడ్యా. ఆమెను స్టాలిన్ పెండ్లాడాడు. ఆమెవల్ల ఒక కొడుకు, ఒక కూతురు పుట్టారు.

నడ్యా సిల్కుతయారుచేసే స్కూలులో ప్రవేశించింది. ఆడంబరంలేకుండ అందరితోపాటు ఆమె పని చేసేది. ఆమె వేరే మోటారుకారుకూడ పెట్టుకోకుండ అందరితోపాటు వీధులలో గుంపులలో తోసుకొనిపోయి ట్రామ్‌కార్లలో, బస్సులలో ఎక్కేది.

౧౯౩౨-వ సంవత్సరము నవంబరు ౮-వ తేదిని స్టాలిన్ భార్య ఆకస్మికంగా చచ్చిపోయింది. కొద్దిరోజుల క్రితమే ఆమె బాగా తిరుగుతోంది. సినీమాహాలులో అంతా చూశారు. ఆమెచనిపోయినదన్నవార్త మామూలుగ ప్రకటించారు. ఆడంబరం యేమీలేదు. శవాన్ని చర్చిలో ఖననంచేశారు. దహనంచేయలేదు. ప్రముఖు

లంతా పాడెమోశారు. మిలిటరీబ్యాండు మ్రోగింది.

స్టాలిన్ కోసం తయారుచేసిన అన్నంఅంతా ఆమె తిన్నదట. దానిలో విషంవుందట. అందువల్ల ఆమె చనిపోయినదని కొందరంటారు. కాని, అది నిజంకాదని మరి కొంద రంటారు. కొన్నాళ్ళనుంచి పేగులలో నొప్పిచేత ఆమె బాధపడుచుండేది అనిన్ని, దానిని శ్రద్ధచేయక పోవడంవల్ల యీస్థితి వచ్చిందనిన్నీ కొందరంటారు. తన భర్తతోకూడ ఆమె ఈబాధసంగతి చెప్పలేదట.

తనపిల్లలంటే స్టాలిన్‌కు ప్రీతి. అయినా, స్కూలులో తన పిల్లలను యితరపిల్లలతోపాటే చూడవలసింది గాని, హెచ్చుగా చూడరాదని అతను చెప్పెను...... ......పిల్లలకు స్కూలులో మంచిమార్కులు వస్తూవుండేవి. స్టాలిన్ కొడుకుకు సాహిత్యమం దెక్కువ ప్రీతి. ౧౯౩౮-వ సంవత్సరంలో సోవియట్ బాలభటోద్యమమున కితడు నాయకుడుగ ఎన్నుకోబడ్డాడు.

---

౬

# సామ్యవాదతత్త్వము

స్టాలిన్‌కు నెలకు వెయ్యి 'రూబుల్సు' * జీతం. డబ్బంటే అతనికి శ్రద్ధలేదు. ఇతర సోవియట్ నాయకులవలెనే స్టాలిన్ పేదవాడు. డబ్బువిషయంలో సోవియట్ నాయకులలో ఎవరిమీదగాని ఏమాత్రం మచ్చలేదు. వారి జీతాలు నాణెములలోగాకుండ వస్తురూపంగా ఏర్పాటైనవి. ఇంతకుపూర్వం, పార్టీలో ఎవరుకూడ సాధారణంగా నెలకు ౨౨౫ రూబుల్సుకంటె ఎక్కువ సంపాదించరాదనే నియమం ఉండేది. సగటున ౬౦౦ లకు ఎవరూ మించలేదు. ఓకేసారి ఎన్ని ఉద్యోగాలుచేసినా జీతంఒక్కటే. ఏనాయకుడుగాని వ్రాసిన పుస్తకాలకు కాపీరైటు లేదు.

తలచుకుంటే స్టాలిన్ జారు చక్రవర్తులవలె బంగారు పళ్లాలలో భోజనంచేయవచ్చును. తన స్వాధీనంలోలేని ధనపురాసులేవీ రష్యాలోలేవు. తలచుకుంటే అన్నీ అతనివద్దకు వచ్చిపడతాయి. కాని, అతడవికోరడు. అతడు నిరాడంబరంగా జీవిస్తాడు. అయితే పల్లెటూరిలో వున్న అతనిభవంతిమాత్రం అమెరికాకోటీశ్వరుని భవంతి వలెవుంటుంది. అక్కడకావలసినంతమంది నౌకర్లు, చాకర్లు,

* రూబెల్ విలువ రమారమి రు ౧-౯-౩.

మోటారుకార్లు వున్నాయి.

మతం అక్కరలేదంటాడు స్టాలిన్. అతనిపనే అతనికి మతం. కమ్యూనిజమే అతనికి స్వర్గం, మోక్షం. జర్మనీలో హిట్లరు రోమను క్యాతలిక్ చర్చిని ఏ ఉద్దేశ్యంతో అణచి వేశాడో, స్టాలిన్ కూడ రష్యాలో అట్లాగే అణచివేశాడు. 'మనపార్టీ మతం విషయమై తటస్థంగా ఉండడానికి వీలులేదు. ఎందుకంటే, మతమనేది ప్రకృతి శాస్త్రిలకు విరుద్ధమైనది' అన్నాడు స్టాలిన్. అయినప్పటికి, తనపెళ్లాం చనిపోయినప్పుడు ఆమెకు శాస్త్రోక్త ప్రకారం ఖననసంస్కారం జరిగించడానికి ఒప్పుకున్నాడు. నియంతలలో బైబిలు క్షుణ్ణంగా చదివినవాడత డొక్కడే. అజ్ఞాతపురోజులలో దానిని అతడు చదివాడు.

స్టాలిన్ ఎక్కువమందితో స్నేహంచేయలేదు. ఇద్దరుమాత్రం ఆంతరంగికమిత్రులుగలరు. తన పార్టీ మెంబర్లను 'నువ్వు-నిన్ను' అని పిలుచుకునే స్థితిలో వుంటాడు స్టాలిన్. కాని, వాళ్లుమాత్రం అతనిని అంత చనువుగ పిలవరు. అతని అసలుపేరు యూసిఫ్. అది చాలా పొట్టిపేరవడంచేత అంతకంటే చిన్నపేరుతో పిలవడానికి వీలులేకుండ వుంది. బాగా ఎరుగున్నవాళ్లు యూసిఫ్ అంటారు. కొందరు 'కామ్రేడ్ యూసిఫ్' అంటారు. అతనికేమీ బిరుదులులేవు. దగ్గర పనిచేసే శెక్రటరీలు, గుమస్తాలు అతనినిచూస్తే భయపడరు. చనువుగ వుంటారు. కొత్తగవచ్చినవాళ్ళు కొంచెము ఉద్రేకంపడతారు కాని భయపడరు. అతనిముందు ఇచ్చకములు,

ముఖస్తోత్రములు పనికిరావు.'చిత్తం, చిత్తం'అని చేతులు నలుపుకునేవాళ్ళను చూస్తే వానికి అసహ్యము. తనను నిర్మొగమోటంగా విమర్శిస్తే సహిస్తాడు.

అతని పరోక్షమందు రష్యనులు అతనిని 'బాస్' అని హేళనగ పిలుస్తారు. మాస్కోలులోవున్న అమెరికనులు అతనిని 'అంకుల్ జో' అంటారు.

స్టాలిన్ బయటవారి నెవరిని తరుచుగ చూడడు. అమెరికారాయబారి విలియంబుల్లిట్‌కు మాత్రం ఒకసారి అతనితో కలిసి కూర్చుని భోజనంచేసే మహాభాగ్యం దొరికిందట! అంతకుపూర్వం పరదేశరాయబారుల నెవరిని అతడు చూడలేదు. ౧౯౩౭-వ సంవత్సరము వరకు ఇంగ్లీషు రాయబారుల కెవరికికూడ అతని దర్శనమే కాలేదట! అతడు చాలా బిడియంగా ఎవరితో మాట్లాడకుండ వుంటాడు. ౧౮ ఏండ్లలో ౭ గురు పత్రికాధిపతులకుమాత్రం దర్శనమిచ్చాడు. వారిలో యిద్దరు జర్మనులు, ఇద్దరు జపానీయులు, ముగ్గురు అమెరికనులు.

అమెరికారాయబారి బుల్లిట్ కిచ్చిన దర్శనం కూడ కాకతాళన్యాయం. ఒకసారి స్టాలిన్ ఆంతరంగిక మిత్రు డొకడు విందుచేశాడు. ఆ సమయానికి స్టాలిన్ వచ్చాడు. అక్కడే బుల్లిట్ ఉండడం తటస్థించింది. అంతే. అందరితోపాటు స్టాలిన్ తిన్నాడు, త్రాగాడు, కబుర్లాడాడు, సంగీతంవిన్నాడు, చక్కాపోయాడు — అంతే.

ఇప్పుడిప్పుడు స్టాలిన్ కొంచెం బయటికిరావడం

తరుచు సాగించాడు. ముందుగా ఎవరికి చెప్పకుండ ఎక్కడికిబడితే అక్కడికి వెళ్లుచున్నాడు. మొట్టమొదట పర్యాయం యిటీవలనే రేడియోలో మాట్లాడినాడు. పార్కులో పసిపిల్లలను ముద్దుపెట్టుకున్నాడు- ప్రజారంజకత్వాని కిది చిహ్నమట! ౧౯౩౫-వ సంవత్సరం వేసంగిలో బ్రిటీష్, ఫ్రెంచి, వగైరా రాయబారులను ఆహ్వానించినప్పుడు, ఆహ్వానపత్రంమీద తానుకూడ సంతకంచేశాడు.

దినదినము ప్రవర్ధమానమౌతున్న అతని ప్రజారంజకత్వాని కివి చిహ్నములు కావచ్చును. కాని, లెనిన్‌ను ప్రేమించినంతగ రష్యాప్రజ లతనిని ప్రేమించరు. అయితే అతని ఉద్యమం జయప్రదమగుతూ పోయినకొద్దీ, ప్రజల జీవితసౌకర్యాలు హెచ్చుతున్నకొద్దీ వ్యతిరేకులు కూడ అతని పక్షానికి రావచ్చును. మాస్కోలో భూబలద్వారంగా వేయించినరోడ్లు, టన్నెల్సు చూచి ప్రతిపక్షము వారుకూడ మెచ్చుకున్నారు. 'అతనిలో ఎట్లాగైనా గొప్ప ఉందిరా' అని ప్రజ లనుకొనుచున్నారు.

అత డిటీవల కొత్తపంథా తొక్కుచున్నాడు. ప్రజల జన్మహక్కులను కాపాడాలంటున్నాడు. ప్రజలనగ, తన ప్రతిపక్షులుకూడానట! ౧౯౩౫-వ సంవత్సరం మేనెలలో మాట్లాడుతూ 'మానవహృదయంలేని అధికారవర్గాన్ని' ఖండించాడు. 'అన్నిటికంటె ముందుగ మనం మనుష్యుల ఘనతను కాపాడాలె. ప్రతితరగతివాణ్ణి, ప్రతికార్మికుణ్ణి, మనసమిష్టి శ్రేయానికి తోడ్పడే ప్రతివాణ్ణి మనం గౌరవించాలి. ప్రపంచములోవున్న సంపదలన్నిటిలో మానవ

సంపద అత్యుత్తమమైనది' అన్నాడు స్టాలిన్. మనుష్యులు యంత్రాలకంటే గొప్పవాళ్ళట.

రష్యావిప్లవోద్యమాన్ని తనచేతిలోకి తీసికొని నడిపించినవాడు స్టాలిన్. మానవత్వ మప్పుడు భగ్నమైపోయింది. పాషాణయుగం నిర్మించినవా డతెడు. రష్యాలో పంచవర్ష ప్రణాళిక నడిపించినవా డతడు. రష్యాను యంత్రమయం, పరిశ్రమలమయం చేసి ఆబక్క-దేశంలో సోషలిజమును సాధించిన ధీరు డతడు.—

'ప్రపంచమంతా సోషలిజమ్ స్థాపనకావాలి, కార్మికకర్షకరాజ్యం రావాలి' అనే మారుమ్రోతలతో నింపదలకొన్న సామ్యవాది స్టాలిన్. అతనికార్యం నిర్విఘ్నముగా, దేదీప్యమానముగా కొనసాగి, ఫాసిజమ్, ఇంపీరియలిజమ్ నాశనంకాక తప్పదు. అప్పుడే ప్రపంచశాంతి, అప్పుడే కార్మికకర్షకరాజ్యముస్థాపనము. అప్పుడే ఫాసిస్టుల దురంతరాలకు చెప్పుదెబ్బ!

అప్పుడే సామ్యవాదవిజయము అభ్రంకషము గాక మానదు! అప్పుడే సకల కృత్రిమ భేదరహితమైన సమష్టిమానవసంఘము స్థాపితంకాగలదు! అప్పుడే కర్కశ సంక్లిష్టమైన మానవసంఘాన్ని సహజంగా రేకెత్తిన జీవశక్తి యెదుర్కొనగలదు.



## ౮

# ప్రణయరహస్యాలు

ప్రతిభావంతమైన స్టాలిన్ జీవితంలో ఎన్నడూ కూడా స్త్రీల ప్రభావంచెల్లలేదు.

కాని, మొన్న ఈమధ్య స్టాలిన్‌ను విమర్శించింది ఒక స్త్రీ. ఎవరామె? లెనిన్ భార్య—'నడెజ్‌ధా కాన్‌ష్టాంటినోనా కృప్సజా.'

లెనిన్‌సతికి ౬౮ సంవత్సరాలుంటవి. తల పూర్తిగా నెరిసిపోయింది. అయినా—ఆమె తన జవసత్వాలేమీ కోల్పోలేదు. సహజవాక్పటిమఏమీ సడలలేదు. ఎటువంటిహృదయాల్లోనైనా—అప్పటికప్పుడు విప్లవాగ్నుల్ని రగుల్కొల్పగల తీవ్రత ఆమెలో ఇప్పటికీ సునిశితంగా కనిపిస్తుంది. అటువంటి వనితాతిలకము స్టాలిన్‌ను—'జార్జియా రాష్ట్రంనుండి దిగుమతీ అయిన పూజారి' అని విమర్శించింది!

స్టాలిన్‌కు రెండు పెళ్ళిళ్ళు అయినవి. మొదటి భార్యపేరు స్వానిజె. రష్యాలో ఇక విప్లవం రాబోయే ముందు ఊపిరితిత్తులుచెడి ఆమె చనిపోయింది.

స్వానిజె చనిపోవడంతో స్టాలిన్ జీవితంలో ఒక చిన్నిమార్పు కలిగింది. అప్పటికి అతడొకరహస్యజీవితాన్ని గడుపుతున్నాడు. అతడిని పట్టుకోవడానికి

ప్రభుత్వం సకలప్రయత్నాలూ చేస్తూంది. ఎప్పుడు—ఏక్షణంలో—అరెస్టు అవుతాడో అతడికే తెలియనిస్థితి అది. అట్టి సమయంలో నడియా అనే బాలికతో అతడికి పరిచయం ఏర్పడింది.

స్టాలిన్‌నూ, అతడి అనుచరులనూ పట్టుకోడానికని సెంటు పీటర్సుబర్గులో ప్రభుత్వం ఎన్నో పన్నాగాలు పన్నుతూంది.

కాని ప్రయత్నాలు ఫలించడంలేదు. అల్లిలోవ్ అనే స్నేహితుడు స్టాలినుకు అవసరమైన రక్షణఅంతా ఇస్తూవుండేవాడు. నడియా ఈ అల్లిలోవ్ కుమార్తెయే.

కుమార్తెపుట్టగానే ఆమెకు జ్ఞానపిత (గాడ్ ఫాదర్)గా వుండుమని అల్లిలోవ్ స్టాలిన్‌ను ప్రార్థించాడు. కాని స్టాలిన్ ఒప్పుకోలేదు. ముందుముందు తన జీవితపథాన్ని మార్చగలిగిందేదో ఒక ప్రదీప్తిని ఆబాలికలో తొలిసారే అతడు చూడగలిగాడు.

నడియా పండ్రెండేళ్ళ బాలకుమార్తె అయేసరికి స్టాలిన్‌మీద ఆమెకుగల భక్తి మిన్నుముట్టింది. సాధారణంగా జార్జియారాష్ట్రపు బాలికలు ఈడుకుమించిన బుద్ధిబలం కలిగివుంటారు. మానసికంగానూ, శారీరకంగానూ నడియా విశేషప్రజ్ఞావంతురాలయింది.

రెప్పవాల్చకుండా స్టాలిన్‌ను చూస్తూవుండేది, ఆమె. అలా చూస్తూ హృదయంలో ఎంతో హాయిని పొందేది.

బరువైన ఆ కనురెప్పల్నీ—నల్లటి ఆకళ్ళనీ—

రాటుదేరిన ఆ ముఖాన్ని కరిగించేసి, తనచూపులతో ఒక గ్రుక్కగా త్రాగేస్తూవున్నట్టు కనిపించేది, అంత సేపూను. అతనికేదో పరిచర్యచేయాలనీ—సేవచేయాలనీ వుండేది అమెకు. కాని—ఎలా?

ఒకనాడు ఇంటికి తిరిగి వస్తూ—వీధిలో ఒకమూల ఇద్దరు పురుషుల్ని చూచింది నడియా.

వాళ్లెవరు? ఏమి చేస్తూన్నారు?

సూక్ష్మబుద్ధి గలది. ఆలోచించింది. ఏదో ప్రమాదం వచ్చేలాగ సూచన కనిపించింది. స్టాలిన్‌కు ప్రమాదం వచ్చేటట్టు తట్టింది. కొన్నివారాలనుంచీ అతడికోసం ప్రభుత్వం వెతుకుతూంది.

మెల్లిగా ఇంట్లోకి ప్రవేశించింది నడియా గుక్క తిప్పకుండా అంతా స్టాలిన్‌కు చెప్పేసింది. వచ్చేప్రమాదాన్ని తలుచుకొంటూ, కలిగిన భయంతో వుక్కిరి బిక్కిరి అయిపోయి కంగారుపడుతూంది!

రాటుపోటులకు నలిగివున్నవాడు స్టాలిన్ అప్పటికప్పుడే పదిపండ్రెండుసార్లు 'చావును చావదన్ని' బైటబడ్డ యోధుడు.తన కావార్త చెప్పుతున్నప్పుడు అతివాత్సల్యంతో చూచాడు ఆమె కళ్లల్లోనికి. ఆ కళ్లల్లో అతనికి ఏమి కనిపించిందో!

తనపార్టీలో కొందరు సభ్యులకు ఒక ముఖ్యమైన వార్తను అందించవలసివచ్చింది స్టాలిన్. ఆ పనికి నడియాను నియోగించాడు. తానెవర్ని పూజిస్తూవుందో—అతడు ఈనాటికి తనకు ప్రసన్నుడైనాడు కదా అని ఆనం

దాతిశయంతో తన్మయమైపోయింది నడియా. ఏ సుదినానికి తాను వేచివున్నదో ఆ సుదినం నేటికి సంప్రాప్తమైంది.

అంత ముఖ్యమైన కార్యానికి ఆమెను నియోగించడానికి స్టాలిన్‌కుగల కారణాల్లో మొదటిది ఆమెపై తనకుగల వాత్సల్యమే. రెండవది—ఆమెను పోలీసువాళ్లెవళ్లూ అనుమానించరు. అంత అమాయికంగా వుంటవి ఆ వినీల నేత్రాలు!

సెంటు పీటర్సుబర్గు పట్టణంలో స్టాలిన్‌ను ఖైదు చేశారు. అప్పుడు అతనికీ—అతని పార్టీసభ్యులకూ మధ్య వార్తల్ని అందించింది, నడియా!

చింపిపాతలు కట్టుకొన్న ఒకపిల్ల ఖైదీలకు కూరలమ్ముకోడానికి వచ్చేది. అమాయిక. అనుమానం చెందకుండా గేటు కాపలా పోలీసులు ఆమెను లోపలికి పోనిచ్చేవారు. కాని—ఆమె తెచ్చేది కూర కాదు. స్టాలిన్‌కు పార్టీవార్తలు!

ఏది ఎలావున్నా, ఆ యిద్దరిమధ్యనూ వున్న భక్తి వాత్సల్యాలు అనురాగప్రేమలుగా మారినవి. ఆ యిద్దరికీ వివాహమైంది. అప్పటికి స్టాలిన్‌కు ౩౯ సంవత్సరాలు, నడియాకు ౧౬ ఏళ్లు.

ఇలాటి బాల్యవివాహాలు పాశ్చాత్యదేశాల్లో కొంచెం వికటంగానే కనిపిస్తవి. కాని జార్జియారాష్ట్రంలో ఇట్టివి అపూర్వాలుకావు. నడియా అన్నివిధాలా యువతి. అందువల్ల వయోవిభేదం అంతగా పాటింపదగ్గది

కాదు. పైగా స్టాలిన్‌కు పాశ్చాత్యదృక్పథంకంటె ప్రాచ్యదృక్పథం-ఇటువంటి విషయాల్లో-ఎక్కువ నచ్చేది.

నడియా స్టాలిన్‌కు అర్థాంగిఅయింది: నాయకుల భార్యలందరూ నిత్యమూ కలిసికొంటూ బాతాఖానీ కొట్టుకోవడం పరిపాటి. కాని, నడియామాత్రం ముభావంగా వుండేది. బాతాఖానీఅంటే ఆమెకు సుతరామూ ఇష్టంలేదు. తన బాధ్యత బాగా గుర్తెరిగిన ఇల్లాలు. తాను స్టాలిన్‌వంటి నాయకుడి భార్యఅయినా, ఎవరి మీదా తన అధికారాన్ని చెలాయించేదికాదు.

వివాహానికి పూర్వం ఎలావుండేదో, అయిన తర్వాతకూడా అలానేవున్నది నడియా. పైకి ఎక్కడికీ తిరగకుండా సామాన్యంగా ఇంట్లోనే కాలక్షేపం చేస్తూ వుండేది. భర్తపట్ల ఆమె కనబరిచే వినయవిధేయతలు అద్వితీయాలు. ఆమె ఒక ఆదర్శప్రాయమైన భార్య అనిపించుకునేటట్టు మసులుకునేది. భర్తకు సౌకర్యాలన్నీ చూచేది. లేనిపోని కోరికలతో భర్తను క్షోభపెట్టి ఎరుగదు. ఇలావుండగా, కొంతకాలానికి వారికి సంతాన ప్రాప్తి కలిగింది!

శిశు జననమైనప్పటినించీ, ఏదో మహా పెద్దపని వుంటేనేకాని ఇల్లు కదిలేవాడు కాదు స్టాలిను. ఎప్పుడయినా గోర్కీనుండి క్రెమ్లినుకు పోవలసివస్తే, కుటుంబాన్ని వెంటబెట్టుకుని వెళ్లేవాడు. అక్కడ మామూలు నౌకర్లు వుండే 'బారక్సు'లో రెండుగదులు తీసికుని అందులో వుండేవాడు. వారి జీవితం అతి నిరాడంబరంగా

వుండేది సామాన్యమైన ఆహారాన్నే తీసికొనేవారు: కాయ గూరలు, పులుసు- కొంచెం మాంసం, ఇదే స్టాలినుకు ప్రియమైన ఆహారం.

స్టాలిను ప్రధమకోపి. అతడికి చిర్రెత్తి నప్పుడు మాత్రం మాటకుమాట ఎవరు చెప్పగూడదు.

రాజకీయవిషయాల్లో—ఎప్పుడైనా-అతడికి అటువంటికోపం వచ్చిందా— ఆ కోపాన్ని నేర్పుగా ఉపశమిల్ల జేసేది నడియా. అప్పుడప్పుడు అతని కోపాన్నిఅంతా ఒక్కమాటుగా చల్లారకపోయినా ఎగసివచ్చే జ్వాలలయినా చల్లారేవి ఆమె అనునయింపువల్ల.

స్టాలినుకు సాంసారికజీవితంలోని మాధుర్యాన్ని రుచిచూపింది నడియా. ఆవిధంగా అతనికి రాజకీయరంగంలో ఒక గౌరవాన్ని సంపాదించి పెట్టింది.

నడియామరణంతో స్టాలిను హృదయం భగ్నమై పోయింది. జీవితంలోని ఆనందం అతడు పూర్తిగ అనుభవించనేలేదు. తన ఆనందసౌధం పునాదుల్లో కల్లా కూలి పోయింది.

అట్టే కూర్చుండిపోయాడు స్టాలిను. వాపోయాడు. రాజకీయాలమీద అసహ్యం కలిగింది. రుష్యాభావి మరుగైపోయింది అతని దృష్టికి. "నడియా లేకుండా ఇన్ని బాధ్యతల్ని భరించడంఎలా? ఈజీవితాన్ని గడపడం ఎలా?" ఇదే నిరంతరమూ అతడి వలపోత!

ఆనాటి విషాదదృశ్యం మరువలేము. భార్యాస్మృతి వలన శిథిలహృదయుడైన స్టాలిను- ఈశ్వరుడంటే ఎవడో

ఎన్నడూ ఎరగని స్టాలిను ఆనాడు – ఆ మంచులో – భార్య శవపేటిక వెంట తప్పటడుగులు వేసికొంటూ నడచి వెళ్లాడు! ఆరు నల్ల గుర్రాలబండిమీద ఆ పేటిక వెళ్లింది. ఆ పేటికమీద ఎర్రజండా ఎగురుతూవున్నది !

స్టాలిను జీవితంలో ఇంతటి మార్పు తేగలిగింది ఒక్క నడియామాత్రమే. ఆమె చనిపోయిన తర్వాత మరి పెళ్ళిచేసికోలేదు అతడు. తన ముద్దుబిడ్డలతో నే కాలంగడిపివేస్తూవున్నాడు. కుమార్తె స్వెట్లానా అచ్ఛంగా తల్లిపోలిక. అందువల్ల స్టాలిను ఆమెను చూచుకొంటూ కొంత ఉపశాంతి పొందుతూవుంటాడు.

సాయం సమయాల్లో — కుమార్తె స్వెట్లానా తండ్రితో ముచ్చటలు చెబుతుంది. అది ఒక చక్కని సాంసారికదృశ్యం!

౧౬ కోట్ల ప్రజలకు నియంతఅయిన స్టాలిను ఒకొక్కప్పుడు అట్టే కుర్చీలో కూలబడి—తనప్రియసతి నడియా తలపుకివచ్చి, ఆమెతో గడిపిన ఆ అమృతమయ దినాలను జ్ఞాపకం తెచ్చుకుంటూ—కాలరాక్షసిచేసిన క్రూరకృత్యానికి విలపిస్తూ వుంటాడు!

—ప్రజామిత్ర.

---

౮

# స్టాలిన్ తల్లి

"సోసో ఎల్లప్పుడూ మంచిగావుండేవాడు. అందువలన నేనెప్పుడూ వాన్ని కొట్టలేదు. చాల శ్రద్ధగా చదివేవాడు. వాడు నేర్చుకోవాలని కుతూహల పడని విషయమే లేదు" అంటూ స్టాలిన్ తల్లి విక్టొరినాజుగాష్ విలికోడుకు బాల్యంగూర్చి నవ్వుతూ చెపుతుంది.

ఆమెవయసు ౭౭ ఏండ్లు. జార్జియాలో పుట్టింది- ఆమెకు పుట్టినకొడుకుల్లో ప్రస్తుతం బ్రతికివున్నది స్టాలిన్ ఒక్కడే.

ముసలిదైనప్పటికీ స్టాలిన్ తల్లి శుభ్రంగా జార్జియాదుస్తులు ధరిస్తుంది. ఆమెతల ముగ్గుబుట్టలాగా నెరిసింది. ఆమె ముఖంలో యిప్పటికి కాంతీ, కళా తగ్గలేదు. యువతిలాగా వుండేరోజుల్లో ఇంకా ఇంకా ఎంత అందంగా వుండేదో!

ప్రస్తుతం ఆమె టిఫ్లిస్ ప్రాసాదపు రెండుగదుల్లో నివసిస్తుంది. ఆ రెండుగదులనిండా చిన్నప్పుడు ఆమె కొడుకు సంపాదించిన వార్తాపత్రికల వ్యాసాలు, బొమ్మలూవున్నవి.

స్టాలిన్ బాల్యంగూర్చి మాటాడటమంటే ఆమెకు మక్కువ. గొప్పవాడయిన కొడుకునుగూర్చి మాటాడ

టుమంటే ఎవరికి యిష్టంవుండదు ?

'సోసో గోరి గ్రామంలో జన్మించాడు' అంటుంది- 'సోసో' స్టాలిన్ ముద్దుపేరు. ఆమె ఇప్పటికి ముద్దుపేరు తోనే స్టాలిన్‌ను పిలుస్తుంది.

'నేను ఇప్పటికీ స్టాలినుపుట్టిన ఇంటిని చూపగలను. క్రిస్మస్ పండుగ అయిపోయిన ఎనిమిది రోజులకు ఆయింటిలో సోసో పుట్టాడు. అది చాల పాతది. ప్రస్తుతం నూతన ఫాషన్లతో నిండిన గృహాల్లో నివసిస్తున్నవారు దానిని చూస్తే ఏమంటారో! దానిలోవుండేటప్పుడు నాకు ఇరువైయేండ్ల వయసు. సోసో నాకు నాలుగోకొడుకు. సోసో పుట్టకముందే మొదట ముగ్గురుకొడుకులు చనిపోయారు. అందువల్ల అతన్ని ఎక్కువగా లాలించేదాన్ని.'

స్టాలిను తండ్రి విస్సాలియను జుగాత్ ఎవి. చెప్పులు కుట్టేవాడు. స్టాలిను తండ్రి, అతని తాతలుకూడ చెప్పులు కుట్టే పనిచేసేవారు. బహుశా మూలపురుషులందరి వృత్తి అదేనేమో! అందువల్ల స్టాలినుకూడా చెప్పులు కుట్టేవృత్తే అవలంబించవలసివచ్చింది.

అతని తండ్రి వాంఛకూడ అదే- కాని స్టాలిను పదకొండో యేట తండ్రి చనిపోయాడు- తల్లికి స్టాలిను చెప్పులుకుట్టేవృత్తి అవలంబించడం యిష్టంలేదు-

చెప్పులుకుట్టే వృత్తికంటె గౌరవమైన వృత్తిలో ప్రవేశ పెట్టించాలని ఆమెవుద్దేశం.

నియంతల తల్లులందరూ తమ కొడుకుల విషయంలో స్టాలిను తల్లిమాదిరే తలచారు. ఇది గమనార్హమైన

విషయం- భర్తలు తమకుటుంబవృత్తియందే కొడుకుల్ని ప్రవేశపెట్టాలని చూస్తూవుంటే భార్యలు అడ్డం తగిలినారు—

స్టాలినుకు మతాచార్యవుద్యోగం సంపాదించాలని స్టాలిను తల్లి ఉద్దేశం- వట్టి ఉద్దేశమే, సంకల్పంకాదు కూడా. మతాచార్యునికి మంచిరాబడి వస్తుందని, జీవితం సుఖంగా, శాంతంగా గడుస్తుందని ఆమె ఆపదవిలో కొడుకును ప్రవేశించపెట్ట తలచలేదు- ఆమె ఒకప్పుడు దేవునికి మొక్కినమొక్కు చెల్లించడానికని కొడుకును మతాచార్యుని చేయవలెనని తలచింది-

ఆమె ముగ్గురు తనయులూ పుట్టకలోనే చనిపోయారు- నాలుగో కొడుకు గర్భంలో వుండగా అతను కూడా పుట్టకలోనె చనిపోతాడనే భయంతో 'ఈకొడుకు బ్రతికితే అతన్ని మతాచార్యునిగా చేస్తాను' అని దేవునికి మ్రొక్కుకుంది-ఆ మ్రొక్కు తీర్చుకోవడం కోసమై స్టాలినుకు పదిహేనేళ్లు నిండగానే ఆమె అతనిని టిప్లిసులోనున్న మత విద్యాలయంలో చేర్చింది-

—జనవాణి.

౯

# చిన్నప్పటి కథలు

స్టాలిను చిన్నపుడెలా ప్రవర్తించేవాడో తెలువు కథల్నివింటే స్టాలినుగుణం బోధపడుతుంది- చిన్నపుడు ఆయన నెమ్మదిగా, శాంతంగా ఓర్పుగా వుండేవాడు- ఒకళ్ళకు అన్యాయం చేయడమంటే గిట్టేదికాదు-

స్టాలిను యింటిపక్కనే ఒక త్రాగుబోతువాడు వుండేవాడు- రాత్రిపూటంతా వూరిలో తిరిగి యింటికి వచ్చి కుక్కను దంచేవాడు- పాపం కుక్క మొరుగుతూ ఏడ్చేది- కుక్కఅరుపు విని సోసో జాలిపడేవాడు- ఒక నాడు కోపంవచ్చి తోడివాళ్ళందరినీ తీసుకొని స్టాలిన్ అతనియింటిలో ప్రవేశించాడు-

స్టాలినును చూచి త్రాగుబోతువాడు 'ఇక్కడ నీకేమి పనుంది' అన్నాడు-

తోడివాళ్ళందరికంటే ముందుగా స్టాలిన్ 'న్యాయంకావాలి'అన్నాడు- వెంటనే కుర్రవాళ్ళందరూ కర్రలతో ముసలివాన్ని చితకకొట్టారు-

దెబ్బలుతినలేక ముసలివాడు ఏడుస్తూఉండగా 'కుక్కను కొట్టూఉండగా నీకు ఈనొప్పి కనబడలేదేం' అని స్టాలిను వానికి బుద్ధిచెప్పాడు-

అప్పటినుంచీ కుర్రవాళ్ళకి స్టాలిను నాయకు

డమ్మాడు. అన్నివిషయాలు అతనే నిర్ణయించి, ఉత్తరువులు జారీచేసేవాడు. తరచుగా విహారాలకు పోయేవాడు.

స్టాలినుకు తనకంటె పెద్దవాడైన స్నేహితు డొకడు వుండేవాడు. అతనిపేరు ఆంద్రేజేవ్. టిప్లిస్‌లోని ధనవంతుడైన ఒకరైతుకొడుకు. ధనవంతుడు కావటంవల్ల అతని యింట్లో చాలపుస్తకాలుండేవి. సోసోకు పుస్తకాలంటే అమితయిష్టం. ఆంద్రేజేవ్ కథలుచదువుతుంటే చేతులు కట్టుకొని స్టాలిను వింటూ వుండేవాడు. చదవడం అయిపోయిన తర్వాత ప్రశ్నలు ప్రారంభించేవాడు. అత నడిగే ప్రశ్నలకు కొన్నిటికి సమాధానాలే లేవు. ఒకపుడు "చెట్ల ఆకుల్ని ఎవరు సృజించారు" అని అడిగాడు.

'దేవుడు సృజించాడు. అని ఆంద్రేజేవ్ ప్రత్యుత్తరం యిచ్చాడు.'

'ప్రతి ఆకును దేవుడే సృజించాడా' అని మరల అడిగాడు.

'అవును.'

'టిప్లిస్‌లోనున్న చెట్లమీది ఆకులనన్నిటినీ దేవుడే సృజించాడా?'

'టిప్లిస్‌లోని చెట్లపై ఆకులనేకాదు ప్రపంచంలో ఎచటనైనా ఆకుల్ని దేవుడే సృజించాడు.'

'నదుల్నికూడా దేవుడే పుట్టించాడా?'

'అవును.'

'ప్రజల్నికూడానా?'

'అవును.'

సోసోకు ఇప్పటికే విసుగెత్తింది- కూర్చున్నవాడు లేచి 'నీవు వట్టి అబద్ధాలు కోరువు. మానాయన రోజంతా పనిచేసి ఒకజత చెప్పులుమాత్రమే కుట్టాడు- అలాంటపుడు ప్రపంచలోని వస్తువు లన్నిటినీ దేవుడొక్కడే ఎలా చేయగలడు? అతనికి వ్యవధి చాలదే!' అన్నాడు.

స్టాలినునుగూర్చి చెప్పే ఇంకోకథలో రుష్యను చక్రవర్తి జార్ ఐవాన్ పేరు విన్నపుడు అత డెంత కోపం పొందేవాడో తెలుస్తుంది-

'ప్రజల్ని అలా నిర్దయగా చూడడానికి జారుచక్రవర్తికి అధికారంవుందా! జారుచక్రవర్తికూడా మనిషే. మనిషైనవాడు ఇంకోమనిషిని నిర్దయగా చూడకూడదు. ఒకవేళ చూస్తే అతన్ని హత్యచేయాలి' అన్నాడు.

విద్యార్థులాతో సోసో చాలాస్నేహంగా వుండేవాడని చెప్పాను కాదా! అతనెపుడు వాళ్ళకు ద్రోహంచేయక సహాయంచేస్తూవుండేవాడు కాబట్టి అందరూ స్టాలినును నమ్మేవారు-

ఏదైనా తప్పుచేసి పట్టుబడితే తననేరాన్ని ఇతరుల మీదికి త్రోసివేయక ఒప్పుకునేవాడు స్టాలిన్.

ఒకనాడు తోడివా డొకషాపులో చాకలేట్‌ను దొంగిలించాడు- అది షాపువాడు కనిపెట్టగా తోడివాడితో 'నేను నీకంటే బలంగావున్నాను కాబట్టి వాడు దెబ్బలుకొట్టినా బాధలేకుండా తినగలను. కనుక నేనే నేరంచేశానని చెప్పుతాను. నీవు వూరుకో' అని నేరం తాను చేశినట్టు చెప్పాడు-

5

స్కూలుమాష్టర్లుకూడా స్టాలినును ప్రేమించే వారు- పాఠాలు శ్రద్ధగా చదివి తప్పులులేకుండా వొప్ప జెప్పేవాడు.

ప్రపంచానికంతా ఒక్కసారి హడలు పుట్టించిన ఆర్మీనియాహత్యలు స్టాలిను జీవితాన్ని మార్చివేశాయి.

లక్షమందికంటె ఎక్కువమందిని అకారణంగా హత్యచేశారు. స్టాలిను యీ విషయం విని జాలిపడ్డాడు. ప్రజలకు ఎంత అన్యాయం జరిగిందని ఆక్రోశించాడు.

ఆర్మీనియాలో బాధలు పడలేక పారిపోయి వచ్చిన ప్రజలతో సంభాషించాడు. వారి కథలు విన్నాడు. అప్పటి నుంచి నిరంకుశుల్ని అనచడానికి కంకణం కట్టాడు.

సోషలిస్టువాఙ్మయం చదవడానికి పూనుకోవడం కూడ అప్పటినుంచే. కారల్‌మార్క్సు వ్రాసిన పుస్తకం అతనిగదిలో వుండగా విద్యాలయాధికారులు చూచి అతన్ని విద్యాలయంనుండి బయటకు పంపివేశారు. కాని అందుకు అతను విచారపడలేదు. మతాచార్యుడుగా వుండకూడదని సంకల్పించుకున్నాడు. తన వుద్దేశాలకు ప్రాణాలుకూడా ధారపోయాలని దృఢనిశ్చయం చేసుకున్నాడు.

—జనవాణి.

౧౦
# స్టాలిన్ అలవాట్లు

కార్యాలయం క్రెమ్లినులో. ఆహారం, వ్యవహారం ఒకే మేజా బల్లవద్ద జరుగుతుంది.

ఆఫీసుగదిలో మెహాగనికుర్చీలు-ఎదురుగా గోడ మీద కారల్ మార్క్సు చిత్రపటం వుంటవి.

ఆఫీసుపని చూసుకునేటప్పుడు మామూలు కాలర్ లేని సోవియెట్ యూనిఫారమ్ ధరిస్తాడు.

ఆయనను ఆఫీసులో దర్శిస్తే సావకాశంగా ఆయన విషయాలన్నీ పరిశీలించవచ్చు. నీవు ఎదట కూర్చొనివున్నా నీతో ఏ ముచ్చట ప్రసంగించడు.

చిన్న చిన్న కాగితం ముక్కల మీద ఏదో వ్రాస్తూ, ఊ సున్నాలు చుట్టి వాటిని కత్తిరించి చింపి వేస్తుంటాడు. చూసేవాళ్లకు దానిలో అర్థం బోధపడక విసుగుపుట్టేమాట నిజమే.

సూక్ష్మనేత్రాలు, పొదలలాంటి ఎత్తైన కను బొమలు.

ఆసూక్ష్మనేత్రాలే ఒక్కొకప్పుడు విశాలంగా వికసించి బాహ్యదృష్టి ఎదట కూర్చున్న వాళ్లమీద పడుతున్నదా అనిపిస్తుంది. కాని అంతర్దృష్టి మరొక ఆలోచనలో లగ్నమై వుంటుంది.

గుబురుగావున్న బుర్రమీసాలు. ఆముఖంలో కొంత అందవికారం కలగడానికి అవేకారణం.

అమితబిరుసైన తలకట్టు క్రాపును తన వేళ్ళతో ఊ ఎగదువ్వుతుంటాడు. ఆ కారణంచేత ఎప్పుడు దువ్వి నట్టుండదు.

ముఖంలో చిరునవ్వు అనే మాట కనుపడదు. నవ్వుకనుపరచవలసిన ఆగత్యం ఎప్పుడైనా వస్తే ఒక్క సారి అకస్మాత్తుగా కనుబొమలుపైకి ఎగురవేస్తాడు.

కంఠధ్వనిలో కాఠిన్యం కనుపిస్తుంది.

చలికాలం క్రెమ్లిన్ నగరంలో, ఒక మేడ పై అంతస్థులో నివసిస్తుంటాడు. ఎండాకాలం గోర్కీనగరంలో వున్న ఒక చిన్న ఇంట్లో నివాసం.

భార్య చనిపోవకపూర్వం పై ఇల్లు పుచ్చుకున్నాడు.

వొకానొకప్పుడు విశాలభవనంలోనే నివసించే వాడు.

దానిలో ఉండవలసిన హంగులన్నీ ఉండేవి. సోఫాలు, కుర్చీలు, చలువరాతి వాజులు, వాటిలో రకరకాల చిన్న తాటిచెట్లు, ఇంటినిండా తెరలు-ఎన్నెన్నో వుండేవి.

కాని వొక విషయం:

అవి అన్నీ తాను ఏర్పరుచుకున్నవి కావు. స్టాలినుకు అవివున్నా ఒక్కటే. లేకపోయినా ఒకటె. సందర్భవశాత్తు అవి అక్కట తటస్థించినవి.

కలే కాయలన్నా, నారింజపండ్లన్నా స్టాలినుకు

మహా ఇష్టం.

భోంచేసేటప్పుడు మేజాబల్లమీద గుడ్డ వేసినా వెయ్యకపోయినా వొకటే.

ఇంట్లో తన పిల్లలు ఏమాత్రం కదిలి మెదిలి ఆడడం కాని, కుంయ్యి, కంయ్యి కాని కిమినాస్తి.

తన్న చిన్నకొడుకు అందం చూచుకొని స్టాలిన్ అతిగా మురిసిపోతాడు.

ఇతర వ్యాపకా లేమీ లేవు.

ఇంట్లో ఉన్నప్పుడు ఘాటైనపొగాకు వేసిన పైపుతో దమ్ము పీలుస్తాడు.

కాని, ఇతర బహిరంగప్రదేశాలలో సిగరెట్లు మాత్రమే కాలుస్తాడు.

ఆధునికనాటకాలంటే ఆయనకు ఇష్టమే. కాని, పూర్వకాలము నాటి నాటకాలంటే అమిత అభిమానం.

ఏ విషయమైనా అమిత ఓపికగా, అమిత నిదానంగా తొట్రుపాటు లేకుండా ఆలోచిస్తాడు.

భారంగా ఆలోచించుకుంటూ నడుస్తాడు.

దైవమంటే వేరేలేదు- ప్రపంచజ్ఞానమే దైవమంటాడు.

చరిత్రాత్మకమైన పురుషులను ఒకరితో ఒకరిని పోల్చడం ప్రమాదకరమైన విషయం అంటాడు.

కాని జంఘిస్‌ఖాన్ స్టాలిన్‌లను మనం పోల్చవచ్చు. —జనవాణి.

# ౧౧
# స్టాలిన్ నిరంకుశత

సామ్యవాద దేవతను పూజింప అనుచరులతో నెత్తురుకాలువలు యీదినాడు బహుదీక్షతో జోసెఫ్ స్టాలిన్. విధివశమున చెప్పులుకుట్టుట తప్పి ఏకఛత్రాధిపతిగా ప్రపంచములో ఆరవవంతు భూభాగమైన రష్యా ఏలుచున్నాడు. ప్రథమంలో ఆతని శుద్ధ మొద్దుఅవతారమునకు మురిసి రష్యాసామ్యవాద జన్మదాత అయిన లెనెన్ సెంట్రల్ కమిటీ సభ్యులకు- అనగా 'ఒటింగ్ కేటిల్' అనే పసువులమందకు కార్యదర్శిగా- నియమించినాడు. స్టాలిన్ లెనెన్ బ్రతికియున్నంతకాలము స్వామిభక్తిపరాయణుడై కుక్కవలె విశ్వాసవంతుడై మెలగెను. లెనెన్ మరణానంతరమున అధికారముపై ఆశచే తనదేశమునే పీనుగులపెంటగా చేయుచున్నాడతడు. సామ్రాజ్యముపొందుటకే తనతో కార్యభారమువహించిన సెంట్రల్ కమిటీసభ్యులను ఒక్కొరొకరిని మృత్యుముఖమునకో, పరదేశమునకో ఒప్పజెప్పుచున్నాడని యితర దేశీయులలో అనుమానములుకలవు.

స్టాలిన్‌కు బాల్యము తేజోవంతముగాలేదు. పాఠశాలకు పొమ్మని పంపిన వీధులవెంట ముష్టిఎత్తుకునేవాడు. దారేపోయేవాళ్ళన్ను దమ్మిడీలు యిచ్చేవరకు తం

టాలు పెట్టేవాడు. ఇట్లా ఆడుకుంటూ గోరీనగరములోని రాజభవనమునకు సమీపమందున్న సిల్వర్ క్రాసువద్ద కూచుని రాజభవనముపై దృష్టి లగ్నముచేసేవాడు. ఏమి యోచించువాడో పాఠకులే గ్రహించగలరు.

సంప్రదాయప్రకారము విద్యావంతులైన జార్జియన్లు బీదలకు విద్యాదేవ్యధికారము పొందుటకు, ప్రజలచే పూజలొందుటకు సాధనమని నమ్మికకలవారు. అందుచే స్టాలిన్ తల్లి తనకుమారుడు విద్యావంతుడై గొప్పవాడు కావలెనని కోరుకొనునది. స్టాలిన్‌కు ఏడవ ఏట అమ్మవారువచ్చినది. అది నెమ్మదియైన తరువాత శ్రద్ధగా చదువుకుని బహుమానములను కూడా పొందినాడట. కాని అతడు టిఫ్లిన్‌లో దుండగీండ్రతో తిరుగువాడనియు, చదువన్నది అంటలేదనియు చాలమంది భావము.

తండ్రి స్టాలిన్‌ను చెప్పులుకుట్టువానిగా తయారుచేయ నెంచినాడు. కాని, విద్యావిహీనయగు తల్లి, పుత్రుడు చదువుకొని గొప్పవాడు కావలెనని వాంఛించినది. ఆమె ధైర్యము, పట్టుదల, వివేకము స్టాలిన్‌కు బాగా పట్టుబడినవి. పదకొండవఏట ఆతనితండ్రి చనిపోగా భారము తల్లిమీద పడినది. ధీశాలియగు ఆతల్లి పుత్రుని కూలి పనిచేయుమని బాధించక తాను అర్ధరాత్రివరకు బట్టలు కుట్టి ధనము సంపాదించి తినగా కొంచెము మిగిల్చి పుత్రునికి చదువుచెప్పించేది. ఆమాతృదేవి పట్టుదల నిరుపమానము కదా!

స్టాలిన్ మతగురువు కావలయునని ఆమాతృమూర్తి మనోరథము. అట్లనే అతడు సామ్యవాదమత ప్రచారకుడైనాడు. లెనెన్ కట్టిన దేవళమునకు నేడు నిరంకుశుడైన పూజారి అయినాడు. తల్లి ప్రోత్సాహమున టిప్లిన్‌లోని మత విద్యాలయములో జేరినాడు.

మతాధికారులు అచ్చట నిరంకుశులు. సామ్యవాదపు వెల్లువ బయలువెడలిన రోజులవి. గురువులు విద్యార్థులు లేని సమయముచూచి వారిగదులు శోధించువారు. అదియే మనకథానాయకుని రేకెత్తించినది. కాగా దొంగతనముగా సామ్యవాదపు గ్రంథములను తెప్పించుకొని చదువువాడు. అతని ప్రవర్తన కనిపెట్టి విద్యాలయము నుండి తరిమినారు. ౧౮౯౬ లో జార్జియాలో ఒక రహస్యసంఘ మేర్పరచినాడు. దానికి ట్రెడాయొసిస్టు అని పేరు.

తదనంతరము బాకునగరములోని కార్మికులతో కలసి ఒకరహస్యసంఘ మేర్పరచినాడు. అచట భూగృహములో ఒక యింజనీరు సహాయమున ముద్రణాలయమును నిర్మించినాడు. లెనిన్‌యొక్క గ్రంథములను ముద్రించి విపరీతముగా ప్రచారముచేసినాడు. ఆ గృహములోని పనివాండ్రు వెలుతురు—సూర్యరశ్మి—చూడకుండ మూడుసంవత్సరములు పనిచేసి విప్లవగ్రంథములను ముద్రించినారు. వ్యాసములకు ఫోటోలు ఎత్తి చిన్న బ్లాకులుచేసి ముద్రించువారు. ప్రజలు వాటిని భూతఅద్దములతో చదువుకునేవారు. కనపడని సిరాతో వ్రాసిన

విదేశపత్రికలను తెప్పించుకొని చదివేవాడు. కాని ప్రభుత్వపు అనుమానదృష్టిని అరికట్టుటకుగాను భక్తికై బుక్కుబైండింగుపని చేయువాడు.

ఆతడు విప్లవకారుడుగా నుండియే ఉన్నతవిద్య సంపాదించినాడు. బాకునగరమందలి జైలులో విప్లవకారుల ననేకులను మడత్రొక్కినట్లు పెట్టిరి. ఉద్రేకముతో వారిలో వారే ఉరికించుకొని, పొడుచుకొని నానాబీభత్సము చేయుచుండిరి ఖైదీలు.

స్టాలిన్ ఆత్మవిశ్వాసము వర్ణనాతీతము. జైలు పురోభాగమున ఉరికంబము. నిర్మించి విద్రోహులను లెక్కలేకుండ ఉరితీస్తూవున్నా స్టాలిన్ కొంచమైనా కలత బారక మార్క్సు, లెనెన్‌ల గ్రంథరాజములను తలక్రింద పెట్టుకొని గుండెపై చేయ వైచుకొని గాఢముగా నిద్ర పోవువాడు. జారుప్రభుత్వము చేయు ఆ యమానుషకృత్యములు ఆతనిని దృఢచిత్తుని చేసినవి.

అతడు పలుమారు ప్రవాసశిక్షలనుండి, జైళ్ళ నుండి తప్పించుకుని పారిపోయేవాడు. మరల పట్టుపడకూడదని పెద్దపెద్ద గెడ్డములు మీసములు పెంచుకునేవాడు. మారుపేళ్లు పెట్టుకునేవాడు. అందుకే అతనికి డేవిడ్, కోల్బా, జోజో, సోసో, స్టాలిన్ ఇట్టు పెక్కు పేళ్లున్నవి.

౧౯౧౩ లో పదునారవసారి ప్రవాసశిక్షనుండి తప్పించుకొన్నాడు. సెంట్‌పీటర్సుబర్గులో సామ్యవాద సభలో నుండగా పోలీసులు ఆతనిని కనిపెట్టినారు. వెంటనే ఆతనిమిత్రులు ప్రక్కనున్న గదిలోనికి తీసుకుపోయి

ఆడవేషం వేసినారు. కాని పోలీసులు ఆ ఆడదాన్నే పట్టుకున్నారు. ఈసారి కిరికా అనే గ్రామమునకు పంపిరి. అది ఆర్కిటిక్ సర్కిల్ వద్ద నున్నది. ఆప్రవాసశిక్షలో ఆతనికి ఆరోగ్యం చెడినది. చావుబ్రతుకుల మధ్య అల్లాడినాడు. చలికాలంలో అడవిబాతులను వేటాడియు, వేసవిలో చేపలను పట్టుకొనియు కమ్మగా వండుకుని తినేవాడుట! ఆకష్టజీవనంలోకూడ విద్యపైనున్న మమకారమువల్ల, భావి అధికారవాంఛవల్ల మార్క్సు, డార్విన్ మహాశయుల గ్రంథములను చదివేవాడు.

౧౯౧౭ లో విప్లవంవచ్చింది. ఆతనిని విడిచినారు. వెంటనే పెట్రోగ్రాడ్ చేరుకున్నాడు. 'ప్రవ్దా' పత్రికకు సంపాదకుడైనాడు. విప్లవం తీవ్రరూపందాల్చినప్పుడు సైన్యాధికారియై విజయం గాంచినాడు.

౧౯౧౯-౨౦ లో కార్మికకర్షక సంఘమునకు కమిస్సర్ (సేనకు భోజనసామగ్రి జాగ్రత్తపెట్టెడు ఉద్యోగి) గానుండెను. ౧౯౨౦-౨౩ వరకు విప్లవదళాధికారము వహించిన సభలో సభ్యుడుగా నుండెను.

విప్లవం విజయవంతంకాగానే సెంట్రల్ కమిటీ సభ్యుడైనాడు. లెనెన్ మరణానంతరమున ౧౯౨౪ లో ట్రాట్‌స్కీని పాతాళమునకు దిగద్రొక్కి సర్వాధికారి యైనాడు. ఆతని నిరంకుశతకు ఎదురు నిలచువారి నందరిని మరణమందిరమునకు నిర్భీతిగా పంపుచున్నాడు.

ఈ ప్రళయకాలరుద్రుని కథకు లనేకవిధముల చిత్రించుచున్నారు. ఏది నిజమో చెప్పుట చాలాకష్టము

వీరపూజ ప్రబలిన రష్యాలో ఆతనిని ఒక దేవతాపురుషునిగా చిత్రించినారు. ఆత డొక మహారాజని, ప్రజల ముఖము చూడడని వదంతి. ఆతని ముఖము స్ఫోటకముచే అందవికారముగా నుండుటచే ప్రజలలో కలియడని కొందరు. అలాటివి ఏమియు లేవని ప్రత్యక్షముగా చూచిన లూడ్విగ్ అను జర్మన్ గ్రంథకర్త వ్రాసినాడు.

ఆతడు స్నేహితులతో తరచు మాట్లాడడు. చమత్కారముగా భాషించుట ఆతనికి తెలియదు. నవ్వితే గుండలో గులకరాళ్లు చప్పుడైనట్టు వుండునట. అతనికి గ్రంథపఠనమున ఆశక్తి మెండు. ధనమునకు, సుఖమునకు ఆతడు అతీతుడు. అధికారమునం దాశక్తి కలదుగాని గర్వి కాడు. ఏపనియైనను బహుజాగరూకతతో పరిశీలించి నెమ్మదిగా చేయును. ఇతరులపై ఆధారపడడు.

ఆతడు స్ఫురద్రూపి. చండశాసనుడు. అతనిది సుగ్రీవాజ్ఞ. కుమారుడు మాస్కో టెక్నికల్ స్కూలులో చదువుచు పరీక్ష తప్పినాడు. ఆచదువు తనకిష్టము లేదని కుమారుడు సూచించినాడు. దానికి కోపించి స్టాలిన్ యింజనీరగుటకు హితవు లేనిచో ఆతనిని చెప్పులుకుట్టుకొనుమని తన దృక్పథమునుండి తరిమెను.

స్టాలిన్ యింటివద్ద నున్నచో చిరుగుల చొక్కాలనే ధరించును. చిరుగులకు అతుకులు వేసికొని తొడుగుకొనును. నలుగురిలోను కలయునప్పుడు మాత్రము సూటు వేయును. విందు లారగించుట ఆతనికి ఇష్టముండదు. త్రాగుడుఅన్న అసహ్యము, కాని తనతో కలిసి విందు

ఆరగించువారికొరకు గాను, కొంచెముగా ద్రాక్షరసము త్రాగును.

చదురంగమన్న విశేషప్రీతి. ప్రజాప్రబోధము చేయు పాటలన్న పరమసంతోషము. రష్యాభాషతప్ప యితర భాష లంతగా అతనికిరావు.

ఈ నియంతప్రపంచమునంతను సామ్యవాదపు వెల్లువతో ముంచవలెనని వేచియున్నాడు—సాధ్య మగునా ?

అందుకుగ్గాను నిరంకుశుడై తనతో కష్టించి సామ్యవాదము నెలకొల్పిన వారిని పలువురను బంధించి, పలువురను హత్య చేసి, పలువురను ఉరులుతీసి, కొం దరిని దేశాంతరమునకు తరిమినాడు. ఆతని జోడైన ట్రాట్‌స్కీ జీవముతో దేశాంతరమున వున్నందుకే ఆతడు వగచుచున్నాడు. ఈప్రళయ తాండవమంతా అతడు స్వదేశములోనే.

ఇతర నియంతలగు హిట్లర్ ముసోలినీలకును ఆత నికి యిక్కడే తేడా. హిట్లర్, ముసోలినీలు ఇతర దేశ ములపైబడి కబళించుచుండ స్టాలిన్ తన స్వదేశీయులనే మ్రింగుచున్నాడు. ఇట్లు పచ్చినెత్తురు త్రాగుచున్న ఈ నియంత సంకల్పము ఎంతవరకు సిద్ధించునో కాలమే నిర్ణ యించవలెను.

—కొత్తపల్లి శ్రీరామమూర్తి.
(ఆంధ్రభూమి)

ఆంధ్రభూమి ముద్రణాలయము—వేపేరి, మదరాసు.

ఆంధ్ర



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA104192 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 79 |
| పెద్ద సైజు పేజీలు | నో |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 42 |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | Kasimbi |
| స్కాన్ చేసినది | prathyusha |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | నో |
| | GOOD |